# శ్రీ శారదాదేవి

జన్మదిన శతవార్షికోత్సవ ప్రచురణము

రచయిత:

శ్రీ నండూరి బంగారయ్య



శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు :: మద్రాసు

# అంకితము

మాతృదేవి యలంకరించిన స్త్రీలోకమున

కీ పుస్తకము భక్తిపూర్వకముగ

నంకిత మొనర్చుచున్నాను.

# శ్రీ శారదాదేవి

## పీఠిక

అతిలోక రమణీయమగు శ్రీ శారదాదేవి శీలసంపద నాయనసమర్థతను గణింపనీయక ఈ రచనా సాహసమునకు పురికొల్పినది. కీర్తిధనమును గాని జగద్ధితమునుగాని లక్ష్యములుగా నుంచుకొనుట యసమంజసము కానేరదుగాని అంతతో తృప్తిపడక సత్యాన్వేషణమున నా కిది యూతకోలగా నుపచరించునని కూడ ఆశించుచున్నాను.

ఇందు చిత్రితమైన పూజ్యమూర్తికి పదునేడు సంవత్సరములు (1903-1920) సమకాలికుడను కా గల్గుట ఒక మహాభాగ్యము. ఆమెతో ననుదినము మెలగిన వ్యక్తులు ఇంకను జీవించి యున్నారు. వారి నడిగి ఆమెనుగూర్చి విశేషాంశములు తెలిసికొనుట కవకాశమున్నది. ఆమె నాకు పరమ గురువను నభిమానమును దూరముగనుంచి—నాకు లభ్యమైనయు దంతముల సత్యాసత్య పరిశీలనమున నిష్కర్షమగు నిష్పాక్షికబుద్ధి నవలంబించితిని. ఆంగ్లమున దొరకినంతవరకు ఆమెను గూర్చిన పుస్తకములను వ్యాసములను ప్రాలుమాలికలేక పఠించితిని. ఆమె నివసించుచువచ్చిన ప్రదేశములను దర్శించితిని. ఆమె సన్నిధానవర్తులతో ముచ్చటించితిని. ఇంత కృషిచేసిగాని కాగితముపయి కలము పెట్టలేదు. సహజలావణ్యముతో నలరారు నామె శీలవైభవమును నాయనసమర్థత సహితము పూర్ణముగ మరుగుపరుపజాలదను విశ్వాసబలముతో నీ యుద్యమమున కుపక్రమించితిని.

వివేకానందుడు రామకృష్ణుడు శారదాదేవి—ఈ త్రిమూర్తులను తెలుగు వారి కన్నులకు గట్టినట్లు చిత్రింపవలెనని చిరకాలముగ నా యభిలాష. అందు కష్టతమమైన శారదా చిత్రణమునకు మొదటనే పూనుకొనవలసి వచ్చినది. విగ్రహ గాంభీర్యము, వచోనైపుణ్యము, బాహ్యోదంతముల బాహుళ్యము వివేకానందునిలో ప్రత్యక్షమగుచున్నవి. అందుచే నాతనిని జిత్రించుటలో నంతకష్టము కానరాదు. ఇక రామకృష్ణుని కడకు వచ్చునరికి ఆతని జీవితమంతయు మానవమాత్రుల కందని యతీత భూములలో నడచినది. ఆ కఠోర సాధనలనుగాని ఆ దివ్యదర్శనములనుగాని ఇప్పటి వారు ఊహించుటకైనను శక్యముకాదు. కాని ఆతని వాక్యములలోని కవితా మాధుర్యము హాస్యరసప్రయోగము సామాన్యమానవులనుగ్గాఢ

ఆకర్షింప జాలియున్నవి. శారదాదేవి విషయ మాలోచించినచో ఆమె గొప్పతనమును నిరూపించుటకు బాహ్యమైన యాధారములు మరింత తక్కువ. హిమవత్పర్వత శ్రేణివలె నామె ఘనతయంతయు నీహార సంఛన్నము. సాధారణమర్త్యులయెడ గృపాళువై పరమహంస తనశక్తిని తరచు సమాధిరూపమునను నృత్యరూపమునను గానరూపమునను గానముకంటెను హృదయాహ్లాదకరమగు వాక్యరత్నముల రూపమునను ప్రకటించుచుండువాడు. అతని ప్రసంగము లన్నియు యథాతథముగ సేకరించి ప్రకటించినారు. మాతృదేవి ప్రసంగములనుగూడ 'మాయేర్ కథ' అను గ్రంథమున ('శారదా ప్రసంగము' లని తెనుగు చేసినారు) ప్రకటించినారుగాని పరమహంసకు సంపూర్ణముగ నాత్మార్పణము గావించు కొనిన యామె ప్రసంగములలోగూడ పరమహంసయే ప్రత్యక్షమగుచుండు టచే నామె ప్రత్యేకతను నిరూపించుకొనుట కష్టసాధ్యముగ నున్నది. ఎంతసేపును ఆమె రామకృష్ణుని జీవితమునకును ఉద్యమమునకును అంత ర్వాహినియైయే ప్రవహించుచున్నది. ఇంతనిగూఢముగ నామె సంచరించి నను అనిర్వచనీయమగు మాతృవాత్సల్య మొకటి యామె మూర్తినుండి యవ్యాహతముగ జాలువారుచున్నది. ఈ వాత్సల్యముద్ర ఆమెకు సంబం ధించిన ప్రత్యంశమునకును అగాధమును అజేయమును నగు ఆకర్షణశక్తి నను గ్రహించుచున్నది.

శారదాదేవివంటి వ్యక్తులు దుర్లభులనుట నిస్సంశయము. అంతటి హృదయ పారిశుద్ధ్యముగాని ప్రతినిత్యము భగవంతుని కరతలామలకము వలె దర్శింపగలిగిన సామర్థ్యముగాని ఏ కాలమునందును అపురూప ములే. ఈ కాలమునందు మరింత. అంతటి అపురూపమయిన శీల సంపదను చిత్రించుటవలన సాధారణవ్యక్తుల కేమి ప్రయోజనము. శారదా దేవి సాధించిన యాధ్యాత్మిక భూములను వారు ఈ జన్మమునగాని మరు జన్మమునగాని సాధింపజాలరు కదా ?

ఈ ప్రశ్నలు వేయువారు మానవ ప్రకృతియందలి సహజ సౌందర్య మును గుర్తింపలేదనియే చెప్పవలసియున్నది. ఈ చిత్రణమునందు అతిశయోక్తిగాని ఆదర్శీకరణమ్ముగాని లవమాత్రమ్మునులేవు. ఆమె కథ

మానవజాతిలో నుదయించినదే కదా! ఆమె సాధించిన దుర్గములను నేడు గాకున్న రేపైన మనముకూడ సాధింప గల్గుదుమనుట నిశ్చయము. ఈ పుస్తక రచనమునందు సాధారణ మానవులనే నేను దృష్టిలో నుంచుకొని వారి కుపయోగపడుటకే ఆశించితిని. అంతేకాదు. ధనములేక నీతిలేక ఏ విధ మయిన ఆధ్యాత్మి కాశయములేక అల్లాడుచు నధమాధములుగ పరిగణింప బడువారికే ఇది ప్రయోజనకారి గావలయును. శారదాదేవి జీవితమునకు పరమార్థమదియే యని నా తాత్పర్యము. మానవసంఘము దూరముగా తరిమికొట్టు నికృష్టులే యామె స్వజనము. వారినిమిత్తమే ఆమె యవత రించినది. ఈ పుటలలో ప్రత్యక్షమగు చిత్రణమును గాఢముగ ధ్యానించి స్త్రీయే కానిండు పురుషుడే కానిండు ప్రతివ్యక్తియు ప్రకృతిలోనున్న పర మార్థమును గ్రహింపగల్గును. ఎట్టి దుర్దశకు వచ్చినను కోలుపోజాలని సంపద యొకటి అమృత పుత్రులగు మానవుల కున్నదని ప్రబోధించు టయే మాతృదేవి జీవితమునకు పరమాశ్రయము.

మాతృదేవి జీవితమునకు గీలకము మాహాత్మ్యముగాదు—మాధు ర్యము. రాజకీయముగగాని సాంఘికముగగాని ఆమె యెట్టి విప్లవమును లేవదీయలేదు. మాహాత్మ్యమనగనే సాధారణముగ బ్రత్యక్షము కావలసిన యుద్రేకమెద్దియు నామె జీవితమున గానరాదు. ఏ యుద్యమమునకును ఆమె నాయకత్వము వహింపలేదు. లోకులను తన వాగ్ధాటితో ముంచి వేయగల వక్తృత్వ మామెకడలేదు. సరిగా సంతకముకూడ చేయ లేని స్థితిలో నామె చదువు నిలచిపోయినది. బంగాళీ భాషలోని రామాయణ భారతాదులను తడుముకొనుచు చదువగల్గెడిదేమో! ధాన్యముదంచుట అంట్లు తోముట వంటచేసి పెట్టుట మున్నగు సామాన్యగృహకృత్యముల నామె యేవగించుకొనక శ్రద్ధతోను సంతోషముతోను నిర్వహించెడిది. బంధు వులనిన నామెకు పరమాదరము. ఇన్నిటిలోను సామాన్య వ్యక్తివలెనే సంచ రించినదే ? ప్రత్యేకముగ నామె ఘనతయనీ చెప్పదగినదేమయిన నున్నదా?

ఆడినమాట కంటెను చేసిన చేతకంటెను "ఆమెయే ఆమె ఘనతకు నెలవు" అని చెప్పవలసియున్నది. వ్యక్తులు తాత్కాలికవ్యక్తులు చారిత్రక వ్యక్తులు శాశ్వతవ్యక్తులు అని మూడుతరగతులు, తాత్కాలిక వ్యక్తులెల్ల

పుట్టిలోపుట్టి మఖలో మాడువారు. చారిత్రవ్యక్తు లనగ శివాజీవలెగాని అహల్యాబాయివలెగాని దేశమునకు సేవజేసి శాశ్వత యశస్సు నార్జించినవారు. వీరు శాశ్వతయశస్సు నార్జించినను శాశ్వతవ్యక్తులు మాత్రముకానేరరు. ఈ రోజున మనకు శ్రీకృష్ణుడుగాని శ్రీరాముడుగాని ప్రత్యక్షమగునట్లుగ వీరు ప్రత్యక్షము కాలేరు. శాశ్వత వ్యక్తులకు నిష్క్రమణ మనునదిలేదు. గాఢమగు భక్తితో నెప్పుడు పిలచిన నప్పుడే ప్రత్యక్షమగుచుందురు. అట్టి తరగతికి చెందినది శ్రీ శారదాదేవి.

సంసార చక్రభ్రమణమున జీవికి గావలసిన దొక్కటే. తానెంత పతితుడయినను తనమంచిచెడ్డలతో నిమిత్తము లేకుండ హృదయమున కదుముకొనగల మధురమూర్తి ఎక్కడనయిన నున్నదా యని ప్రతిజీవియు పరితపించుచుండును. ఈ పరితాపమును జల్లార్చి శాంతిని ప్రసాదింప గలిగిన వ్యక్తులన్నియు ఈ గోళమున కవతరించిన వ్యక్తులలో నగ్రశ్రేణికి జెందవలసినవే. శారదాదేవి ఇట్టి పరమశాంతికి జన్మభూమి. నిరాడంబర ముగ వడిదుడుకులులేక నడచిపోవు నదీమతల్లివలె నున్న యామె జీవి తమునుండి యొక అమృతవాణి వినవచ్చుచున్నది. "బిడ్డలారా! మీకు వచ్చిన భయములేదు. జననమరణములలో దేనికిని మీరు భయపడ నక్కరలేదు. మీ భారము నాది." ప్రసన్న మధురమయిన ఈ దివ్య వాణిని సాంద్రముగ—ప్రశాంతముగ - మలయజేయుటలోనే ఆమె ప్రత్యేక ఘనత యున్నది. ఈ మహిమలో—తుపానులవలె చెలరేగి లోకములను తలక్రిందులు చేయజాలిన వ్యక్తులనెల్ల—ఆమె తలదన్నుచున్నది.

పైని సూచించిన అభయప్రదానమున నామె దర్పమునుగాని రభస మునుగాని ప్రకటించుటలేదు. అడుగని వారిది పాపముగ నవనీత హృద యముతో నిసర్గ మాధుర్యముతో తొణికిసలాడు గారాబముతో నామె యీ అభయప్రదాన మాచరించినది. "వినోదవిహారి సోమ్" "అమ్‌జేదు"ల వంటి పతితులకుగూడ నామెకడ శారదానందునివంటి మహోన్నతాత్ముని కెంత చనవుండెడిదో అంత చనవును ఉండెడిది.

వాగ్వ్యయము చేయకుండుట ఆమె ఘనత కత్యుత్తమ నిదర్శన మని నా యూహ. ఆమెను స్వయముగ దర్శించి కొన్నాళ్లామెతో వసించిన

దేవమాతయను నమెరికా విదుషీమణి ఎంతో నిశితదృష్టితో నిట్లు వ్రాయు చున్నది. "అమె (మాతృదేవి) యెన్నడును బోధించెడిది కాదు. సలహా యిచ్చుటకూడ అరుదు. చారిత్రము వలననే అమె ఘనత వ్యక్తమయ్యె డిది. ఆ పవిత్ర జీవితమును గాంచి ఎందరు (పతితులు) పునీతులైరో, ఉన్నతపదమును బ్రాపించిరో ఎవరు చెప్పగలరు?"

ఇతరుల నున్నతస్థితికి గొనిపోవలెనను నుద్దేశమామెకున్నను లేకు న్నను అమె స్పర్శసోకిన వారికెల్ల ఉన్నతస్థితిసిద్ధించి తీరెడిది. అమె ప్రేమ యను స్పర్శవేదివలన నెట్టి నికృష్ట లోహమైనను బంగారముగ మారవలసి నదేకదా! మాతృదేవి ఘనతను నిరూపించుకొనుటలో నీ యంశమును మనము విస్మరించుట కవకాశమున్నది. అట్టడుగు మెట్లనుండి వందల కొలది మానవులను కట్టకడపటి సోపానములను జేర్చుటలో అమె మహిమము విశేషముగ తోడ్పడుచుండెడిది. తోడిమానవుని ఒక్క మెట్టయినను పైకెక్కించుటనిన నెంతటి దుర్ఘటకార్యమో ప్రయత్నించి చూచిన వారికి సుగమమగును. పెద్దపెద్ద మహాత్ములను శిష్యులాశ్రయించు టయు తుదకు నికృష్టములగు సిద్ధులతో సంతృప్తిపడుచుండుటయు మానవ జాతి చరిత్రమున తరచు గాననగును. అమె పాదముల చెంతకు జేరిన వారికి ఉత్తమమగు నాధ్యాత్మిక సంపల్లాభము ఎంత నిగూఢమో అంత నిశ్చితము. ఒక్కమారుగ జాత్యంతరపరిణామమీయక నిదానముగను క్రమ ముగను అమె తన శిష్యుల యంతరంగ ప్రవృత్తులను మార్చుచువచ్చెడిది. ఆధ్యాత్మికసంపద ననుగ్రహించుటలో నామె చూపినశక్తి మానవజాతి చరిత్ర మున ఎంత అపురూపమో అంతయుగాధమును అపారమును. తప్పటడుగులు వేయు మానవులను సరియయిన మార్గమున బెట్టుటలో దీర్ఘబోధకుడిగక మాతృప్రేమను గారాబమును వర్షించుచు నామె యవలంబించిన స్వాదు మార్గము మానవజాతి చరిత్రమున ఇంచుమించుగ ననదృశము.

నిరాడంబరమగు మహోన్నత జీవనము, స్వాదురసపూర్ణమయిన పతితపావన పటుత్వము నను నీ రెండును అమె శీలమునకు పెట్టనికోటలు. వివేకానందుడు బ్రహ్మానందుడు మున్నగు మహాపురుషులేగాక అమెకు భర్తయు నవతార వరిష్ఠుడును నగు శ్రీరామకృష్ణుడుకూడ అమెకడ నెల

కొన్న ఈ యపారమహిమకు నివ్వెరగంది జోహారు లర్పించినట్లు గనవచ్చు చున్నది. ఈ విశిష్ట లక్షణములను జిత్రించుటకయి నేను శాయశక్తుల యత్నించితిని. ఎంతవరకు గృతార్థుడను కాకల్గితినో వివేక సమన్వితులగు చదువరులు నిశ్చయింపవలెను.

ఈ జీవిత చారిత్రరచనమున నే నవలంబించిన రచనా పద్ధతిని గూర్చి విపులీకరించుట కవకాశమున్నది. కాని వాగ్వ్యయమునకు గడంగుట మాతృదేవి జీవితమును పఠించిన లాభమును గోలుపోవుటయే.

నాకు లభ్యమయిన యితివృత్తమునంతను ఒక్కచో గుదిగ్రుచ్చవలెనని నే నెన్నడును ప్రయత్నించుట లేదు. ఉదంతముల బాహుళ్యమున విస్పష్టతకు వ్యంగ్య మర్యాదకు విడాకులిచ్చుట నా తాత్పర్యము గాదు. ఆమె శీలమునందలి పరమ రహస్యములను నిరూపింపజాలిన యుదంతములను మాత్రమే గైకొని చిత్రించితిని. నిరుపేదరాలగు నాయీ కృతి కన్యపై మాతృదేవి తన ప్రసన్నకటాక్షమును బ్రసరింప జేసినచో నా జన్మము చరితార్థమైనదని భావింతును.

ఈ రచనమున నా కుపకరించిన పుస్తకముల యొక్కయు వ్యాసములయొక్కయు (పత్రికల యొక్కయు) జాబితా వేరుగ నిచ్చినాను. ఆ యారచయితలకు నా ప్రణామ సహస్రములు. నిష్కామ వృత్తితో వ్రాత ప్రతికి సాపు వ్రాసియిచ్చిన నా సన్నిహితజ్ఞాతి చిరంజీవి శ్రీ నండూరి రాధాకాంతముగారి సేవ నాకు సంస్మరణీయము. ప్రూపులు దిద్దుటలో మఠము వారే శ్రద్ధవహింపవలసిన వారైరి. పవిత్రమయిన మాతృదేవి శతవార్షికోత్సవ సందర్భమున నామె కొక సారస్వత మందిరము నిర్మించు నవకాశమును నా కొసంగిన మద్రాసు రామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీమత్ కైలాసానందజీ మహారాజావారికిని శ్రీమత్ శుద్ధసత్త్వానందజీ మహారాజా వారికిని నా ప్రణామ సహస్రములు. మాతృదేవి పాదముల కీ చిన్నికానుకను సమర్పించి నేను ధన్యుడను కాగల్గితినని యానందించుచున్నాను.

రాజమహేంద్రము
జయ — జ్యేష్ఠ బహుళ త్రయోదశీ
సోమవారము

ఇట్లు
బుధజన విధేయుడు
నండూరి బంగారయ్య

# శ్రీ శా ర దా దే వి

## 1. పుట్టుక ; పసితనము

మార్గశీర్ష సప్తమికి సరియైన డిసెంబరు నెల ఇరువది రెండవ తారీఖు (క్రీ. శ. 1853–వ సంవత్సరము) శ్రీ శారదా దేవి జన్మించిన దినము.

బంగాళా దేశమున కలకత్తా నగరమునకు పడమటి దిశగ అరువదిమైళ్ళ దూరమున జయరామవటియను నొక చిన్న గ్రామమున్నది. ఈ గ్రామమున నేడు సరిగా శారదా దేవి జన్మించిన ప్రదేశమున నొక శారదాలయమున్నది. అది యామె శిష్యచూడామణియగు శ్రీ శారదానందస్వామి నిర్మించినది. అదివరలోనున్న పటమునకు మారుగ నీ శతవార్షికోత్సవమున నొక పాలరాతివిగ్రహము నట బ్రతిష్ఠించినారు. ఈ విగ్రహము జీవకళ లుట్టిపడుచున్నది.

ఈ జయరామవటిలో 1853–వ సంవత్సరమున రామచంద్రముఖర్జీయను బీద బ్రాహ్మణుడు వసించుచుండెను. జందెములు వడికియు, పౌరోహిత్యము నిర్వహించియు, సేద్యముచేసియు ఏదోయొక విధముగ కాలక్షేపముచేసెడి వాడు. అకలంకమయిన రామభక్తి యొకటే యాతడు భద్రపరచుకొన్న ధనము. ఆతని భార్య శ్యామసుందరీదేవి రూపసి. రూపముకంటెను ఆమె శీలము మరింత గొప్పది.

ఆమె శీలమునకు శిరోభూషణము నిశ్చలమైన దైవభక్తి. ఈ పవిత్ర దంపతులకు శారదాదేవి జన్మించెను.

ఈమె జన్మమునకు ముందు కొన్ని యద్భుతములు నడచెనట. అవి యామె నోటనే విని శిష్యులు వ్రాసి యుంచినవగుటచే విశ్వసనీయములు.

ఒకనాడు పరిసరముననున్న 'సిహోరు' అను పల్లెటూరిలోని యొక ఆలయమునకు బోయి శ్యామసుందరీదేవి తిరిగి వచ్చుచుండెను. దీర్ఘశంకకు బోవలసిన యనుమానము గలిగి ఆ యాలయ సమీపముననే యొకడొంకచాటున నున్న మఱ్ఱిచెట్టుక్రింద గూర్చుండెను. అనుమాననివృత్తియేమియు కాలేదుగాని కడుపులోనేదో బరువుగదోచి చాలసేపు అట్లే కూర్చుండెను. ఇంతలో నా మఱ్ఱిచెట్టునుండి ఎఱ్ఱని పట్టు పరికిణీ ధరించిన అయిదారేండ్లు వయస్సుగల చక్కని బాలిక యొకర్తు దిగివచ్చి, తన చిట్టిచేతులను ఆమె మెడకు పెనవైచి "అమ్మా! ఇపుడు నేను మీ యింటికి వచ్చుచున్నాను" అని యామె గర్భమున బ్రవేశించినట్లాయెను. కొంతసేపటివరకు నొడలు తెలియలేదు. ఎట్టకేలకు ప్రయత్నమున నామె స్వగృహము చేరుకొనెను. అంతకుముందు ఏదో పనిమీద కలకత్తానగరమునకు బోయియుండిన రామచంద్రముఖర్జీ తిరిగివచ్చిన తరువాత నామెనోట నీ యుదంతము విని భక్తిప్రపత్తులతో—అదిమొదలుగ నామెను స్పృశింపనయిన స్పృశింపక—తొలగి సంచరించుచుండెను. ఈ దివ్యానుభూతియే శారదాదేవి పుట్టుకకు మూలకందము.

ఆ పల్లెటూరిలో పాఠశాలకు బోవు నవకాశము మిక్కిలి తక్కువ. కుటుంబము మిగుల బీదదగుటచే నామె తల్లికి వంటలో సాయముచేయవలసియుండెను. ఒక్కొక్కప్పుడు తానే వంటచేయవలసివచ్చెడిదికూడ. ప్రొయ్యిమీద నుండి బరువైన కుండ దింపలేకపోయినపుడు తండ్రి వచ్చి దింపెడివాడు. పొలములో పనిచేయు కూలీలకు ముంత పట్టుకొని వెళ్లెడిది. మొలలోతు నీళ్ళలో దిగి గడ్డి కోసెడిది. ఒక్కప్పుడు కరువువచ్చి పంట పాడయిపోగా పొలము పొలము తిరిగి ధాన్యము ప్రోగుచేసినది. ఇట్టి కష్టజీవనమున నామె బాల్యము గడచినది.

చిన్నప్పు డామెతో నాడుకొని తరువాత నామెకు భక్తురాలయిన అఘోరమణీదేవి యీ తీరున చెప్పు చున్నది :— "మాతృదేవి ఆటలలోగూడ "అమ్మ" పాత్రమునే ధరించెడిది. జగడములన్న నామెకు గిట్టవు. ఇరువురు తగవులాడుకొన్నచో నామె మాధ్యస్థ్యముచేసి తగవుతీర్చెడిది. ఆమెది మిక్కిలి సరళమైన స్వభావము. తక్కిన పసిపిల్లలకువలె నామెకు క్రీడాసక్తి తక్కువ. కాళికాదేవి, లక్ష్మీదేవి మున్నగు దేవతల విగ్రహములను సంపాదించి బిల్వదళములతోను పువ్వులతోను పూజించు టనిన పరమోత్సాహము.

పసితనమున నొకనాడు జగద్ధాత్రీదేవి యెదుట ఆమె తన్మయురాలయి నిలువబడిపోయెను. పరిసర గ్రామవాసి యగు రామహృదయఘోసాలు డా శుభముహూర్తమున

నామెను జూచుట తటస్థించెను. అప్పటి యామెస్థితిని జూచి "ఈమె సాక్షాత్తు రెండవ జగద్ధాత్రి కాదుగద!" అని యాత డబ్బురపడజొచ్చెను!

## 2. కల్యాణము

పుట్టుకకు తరువాత నామె జీవితమున నడచిన మహోదంతము కల్యాణమే. నవకుసుమకోమలమయిన మా రేడుదళమును పరమేశ్వరుని పాదముల కర్పించునట్లు అయిదవయేటనే ఆమెను శ్రీ రామకృష్ణున కిచ్చి వివాహము చేసిరి.

అప్పటికి శ్రీ రామకృష్ణున కిరువదిమూడేండ్లు. పరమేశ్వరిపాదములను దర్శించు తహతహలో దేహస్పృహ కూడ లేకుండ నాతడు కలకత్తా సమీపముననున్న దక్షిణేశ్వరాలయమున సాధనచేయుచుండెను. సరిగనర్థము చేసికొనలేని పామరులు అతని భక్తిని పిచ్చిగ పరిగణించిరి. ఆ నోట నా నోట నీ వార్త ఆతని తల్లియగు చంద్రమణీదేవిని చేరెను. అప్పటికే యెన్నో కష్టములకు గుఱియైన యా తల్లి దీనికి మరింత డిల్లపడి తన్నొకమారు చూచి పోవలసినదిగ వర్తమానించెను. మాతృభక్తియే పరమార్థ సాధనముగ నవలంబించు కుమారుడు ఆమె యాజ్ఞప్రకారము వెంటనే "కమార్పుకుర"మను స్వగ్రామమునకు వచ్చెను. వచ్చునరి కెట్లున్నను వచ్చినతరువాత కొంత

కుదుటబడినట్లు కనుపించెను. బహుశః స్వగ్రామమునకు వచ్చినతర్వాత నాతనికి గొన్ని దివ్యానుభూతులు కలిగి మనశ్శాంతిని ప్రసాదించియుండవచ్చును.

ఈ పిచ్చి మరల తిరుగబెట్టకుండుటకు సాధనమేమని వారాలోచించుచుండిరి. వివాహమొక్కటే దీనికి పరమౌషధముగ దోచెను. ఆ రోజులలో వరశుల్కములకంటె కన్యాశుల్కములు ప్రబలియుండెను. రామకృష్ణుని కుటుంబము బీదదగుటచే శుల్కములివ్వగల సామర్థ్యము వారికి లేదు. ఎన్నో గ్రామములు తిరిగి విసిగివేసారిరి. పెండ్లి చేయు సంకల్పము కుమారునికి దెలిసినచో నాతడు వెంటనే సన్న్యసించునేమోయని భయపడి వారతి రహస్యముగ సంచరించుచుండిరి. ఆతడు కొన్ని దినములవరకు తెలిసినను తెలియనట్లూరకుండెను. తుదకాతడే కలుగజేసికొని " ఈ యూరు నా యూరు నేమి తిరిగెదరు? నాకయి బ్రహ్మ వ్రాసిపెట్టిన పిల్ల జయరామవటిలో రామచంద్రముఖర్జీ యింట నున్నది." అని వారిని ప్రోత్సహించెను. పెండ్లి మాట యెత్తగనే పారిపోవుననుకొన్న యాతడు ప్రోత్సహించుట వారి కాశ్చర్యము గొలిపెను.

జయరామవటి కమార్పుకురమునుండి నాలుగైదు మైళ్ళు మాత్రమే. ఉయ్యాలలో బిడ్డనుంచుకొని ఊరంతయు వెదకినట్లయినది. పోయి విచారింతురుగదా అన్నివిధముల నా సంబంధ మనుకూలించుచుండెను. కాని పెండ్లికుమార్తె కయిదేండ్లే వయసగుట వారికి మిక్కిలి నిరుత్సాహజనకముగ

నుండెను. అయినను చేయునదిలేక ఆ సంబంధమే వారు స్థిరపరచుకొనిరి.

ఈ సందర్భమున నింకొక జనశ్రుతిగూడ నున్నది. వెనుక జెప్పిన "సిహోరు" అను గ్రామములో నొక తీర్థము జరుగగ రెండేండ్ల పసిబిడ్డయయిన శారదతోకూడ శ్యామసుందరీదేవి అచ్చట కేగెను. కమార్పుకురమునుండి కూడ కొందఱు వచ్చిరి. అందు రామకృష్ణుడుకూడ నుండెను. వేడుకకు బాలికలను బాలురను ఒక్కచో జేర్చి "నీవెవ్వరిని పెండ్లాడెదవు" అని యడుగుట ఒక వినోదముగదా! ఆ తీరున శారదను ప్రశ్నింపగ ఆమె రామకృష్ణుని జూపించినదట !!

రెండు కుటుంబములును బీదవేయగుటచే పెండ్లి పెద్ద మొత్తులమీద జరుగలేదు. వేడుకలనిమిత్త మెవ్వరును కాళ్లు విరుచుకొనలేదు. పెండ్లికొడుకువారు మాత్రము మూడు వందల రూప్యములు కన్యాశుల్కము చెల్లింపకతప్పినది కాదు. తక్కిన విషయములలో సామాన్యపక్షమునే ఉభయులును అవలంబించిరి. వివాహము యథాశాస్త్రముగ నడపిరి. (1859 మెయినెల) చంద్రమణీదేవి ఇరుగుపొరుగు స్త్రీలనడిగి నగల నెరవుతెచ్చి కోడలికి బెట్టినది. కాని ఎవరి నగలు వారి కిచ్చివేయవలెనే? అవి తీసికొన్నచో తన కోడలు చిన్నవుచ్చుకొనదా యని యామె విచారింప సాగెను. అప్పటికప్పుడే యామెకు కోడలిపై నగాధమయిన యనురాగమేర్పడెను.

గృహప్రవేశమునకు వచ్చినప్పుడు రామకృష్ణుడే సడి చప్పుడు లేకుండ ఆ నగలనన్నిటిని ఒలిచి తల్లి చేతనుంచెను. నగలు ఎవరివి వారికి చేరినవికాని కోడలు మేలుకొని "నా నగలేవీ" అని కంట నీరు వెట్టసాగెను. అత్తగారు కోడలిని బుజ్జగించి "గదాయి (శ్రీరామకృష్ణుని ముద్దుపేరు) పెద్దవాడయిన తరువాత నీకు ఎన్నో నగలు చేయించిపెడతాడే" మని యూరడింపసాగెను. వాకిటనున్న శారద పినతండ్రి కీవార్త తెలిసి పెండ్లికొమరునివారితో గలహించి ఆతడు వెంటనే శారద నింటికి దీసికొనిపోయెను. ఇది చూచి చంద్రమణీదేవి మనస్సు చిన్నవుచ్చుకొనెను.

"అమ్మా! వివాహమయిపోయినది. మూడుముళ్లు పడినతరువాత నిప్పుడెవ్వరును దానిని గాదనలేరుగదా!" అని రామకృష్ణుడు తల్లి నూరడింపసాగెను.

## 3. భర్తయే పరదైవము

వివాహమయిన తరువాత దంపతులిరువురును కలిసి అత్తవారింటికి బోవుట బంగాళాదేశమున నొక యాచారమట. శారదాదేవి ఏడేండ్ల బాలికయైయుండగ నీ యాచారము ననుసరించి శ్రీరామకృష్ణు డత్తవారింటికి వచ్చెను. అప్పుడేమి జరిగెనో జ్ఞప్తియందుండుటకు మిక్కిలి పసితనమగుటచే నామె కవకాశములేదుకాని ఒక్కటిమాత్రము తరువాత శిష్యులతో జెప్పుచుండెడిది. ఎవ్వరి ప్రోద్బలము

లేకుండ తనంతతానుగనే ఆమె భర్తను సమీపించి, ఆతని కాళ్ళకు మ్రొక్కి, విసనకఱ్ఱతో విసరుచు నాతని కుపచారము చేసెనట. ఇది చూచి అక్కడనున్న పెద్దవారు తమలోతాము నవ్వుకొనిరట. ఈ సందర్భముననే ఆమె నేకాంతమునకు దీసికొనిపోయి హృదయరాము డామె పాదములను కమలములతో నర్చించెను.

ఆమెకు పదుమూడేండ్లు లేక పదునాలుగేండ్లు వయస్సయినప్పుడు కమార్పుకురములో నొకసారి ఒక నెల రెండవసారి నెలమీద పక్షమునుండి వచ్చినది. ఈ రెండు సందర్భములను రామకృష్ణుడు దక్షిణేశ్వరముననే యుండెను గాని కమార్పుకురమున లేడు. ఈ సందర్భమున నడచిన యొక యుదంతము నామె మహాదేవానందులు మొదలయిన శిష్యులతో నిట్లు చెప్పినది. "నాకు పదమూడేండ్ల వయస్సయినప్పుడు కమార్పుకురము పోయితిని. నేను క్రొత్త పెండ్లికూతురనగుటచే బాహాటముగ చెరువుకు బోయి స్నానము చేయుటకు జంకుచుంటిని. ఒకనాడు పెరటి గుమ్మమునొద్ద నిలువబడి చెరువుకు పోవుటా మానుటా యని సంకోచించుచుంటిని. ఇంతలో నెనమండుగురు స్త్రీలు నాకొరకు వచ్చి యచట నిలిచిరి. నేను వెంటనే వీధిలోనికి వచ్చితిని. ఎనమండుగురిలో నలుగురు ముందు నలుగురు వెనుక నిలిచి 'హాల్దారుపుకుర'మను చెరువు వరకు నన్ననుగమించిరి. నాతోపాటు వారును స్నానముచేసిరి. మరల పెరటిగుమ్మమువరకు వారు నన్ను దిగబెట్టిరి. నేను

కమార్పుకురములో నున్నంతకాలము ఇట్లు నడచెను. ఆ యెనమందుగురు నెవ్వరో తెలిసికొన ప్రయత్నించితినిగాని తెలిసికొనలేకపోయితిని.'' 1867 వ సంవత్సరమున వెనుకటి రాకపోకలు నడచిన మరి నాలుగు నెలలకు హృదయ రాముడు భైరవీబ్రాహ్మణియు వెంటరా శ్రీరామకృష్ణుడు కమార్పుకురము వచ్చెను. బంధువులకు హృదయానంద కరముగ నుండుటకయి శారదాదేవినిగూడ అక్కడికి దీసికొని వచ్చిరి. దేవికి జ్ఞానము వచ్చినతరువాత రామకృష్ణుని గలసికొనుట కిదియే ప్రథమ తరుణము. మూడు నెలల కాలము వారప్పుడు కలసియుండిరి.

అప్పటికప్పుడే శ్రీరామకృష్ణుడు ఆధ్యాత్మిక ప్రాసాదమున శిఖరము నధిరోహించెను. తోతాపురియొద్ద సన్న్యాస దీక్షగైకొని సంపూర్ణమయిన బ్రహ్మజ్ఞానమును అనుభవమునకు దెచ్చుకొనెను. తాను సన్న్యాసియయ్యును తన్నే సర్వస్వముగ నమ్ముకొన్న ఈ బాలిక నాతడు విడనాడలేదు. తన యవ్యాజానురాగముచే నామె హృదయమును మున్ముందుగ చూరగొనెను. ఆమెతో పరిహాసములాడువాడు. తనకేమే కూరలిష్టమో చెప్పి వండించికొని తినువాడు. ఈ తరుణమున నామెను శిష్యురాలిగ జేకొని ఎన్నో యపురూప విషయములలో శిక్షణయిచ్చెను. బ్రహ్మవేత్తయగు గురువు దొరకుట సామాన్య భాగ్యమా? మహాత్ములకు సయితము దుస్సాధ్యములయిన యాధ్యాత్మిక దుర్గములలో నామె కాతడు సామ్రాజ్యము నిర్మించెను. ఉన్నతములయిన

ఆధ్యాత్మిక విషయములలోనేగాక సామాన్యములయిన గృహ కృత్యములలోగూడ శిక్షణనిచ్చెను. ఇంటిలోనున్న ఇతర బంధువులతో నెట్లు నడుచుకొనవలెనో ఇరుగు పొరుగిండ్లకు బోయినప్పు డెట్లు మసలవలెనో పడవలోగాని బండిలోగాని ఎట్లు ప్రయాణము చేయవలెనో చేతనున్న డబ్బు నెట్లు ఖర్చు పెట్టవలెనో కులగురువును, అతిథిని, కులదేవతను ఎట్లారాధింపవలెనో విశదముగ బోధించువాడు. ఆత్మార్పణము, ఈశ్వర సాక్షాత్కృతి మున్నగు గహనవిషయముతే గాక లాంతరులో వత్తినెక్కించుట వంటవండుట మున్నగు లఘువిషయములుగూడ అతని శిక్షణమున ప్రణాళికగా నేర్పడెను. నలుగురు కలిసి పడవనెక్కినప్పుడు అందఱి కంటెను ముందుపోయి ఆఖరున దిగవలెనట. అట్లయినచో సామానులన్నియు సరిగా నెక్కినవో లేదో చూచుకొనుటకు వీలుగా నుండునట. ఈ సందర్భమున భర్త సాంగత్యమున నామె పొందిన యానందమునకు మేరలేకుండెను. తరువాత శిష్యులతో నామె యిట్లు చెప్పెడిది. "ఆతరుణమున నొక యమృతకలశము నా హృదయమున నుంచి నట్లాయెను. అహోరాత్రములు నిరంతరముగ నే నానంద మగ్నయయి యుండుదానను. ఆ యానందము లోకాతీతమయినది."

ముచ్చటగ మూడు నెలలు గడపి రామకృష్ణుడు దక్షిణేశ్వరమున కేగెను. శారదాదేవి పుట్టింటికి వచ్చెను. ఆమె దేహముమాత్రము జయరామవటిలో నుండెనుగాని

హృదయమంతయు దక్షిణేశ్వరముననే శ్రీరామకృష్ణ చరణ సరోజములలో బంధితమాయెను. అది మొదలుగ నామెకు భర్తయే గురుదైవముగను ఇష్టదైవముగను ఏర్పడెను.

సిహోరులో శ్రీరామకృష్ణుని మేనత్త మనుమడగు హృదయరాముని తలిదండ్రులుండిరి. శ్రీరామకృష్ణు డచ్చటికి బోయినప్పుడెల్ల నడుమ నేడెనిమిదిరోజులు జయరామవటిలో నాగుచుండెడివాడు. 'భానుపిషి' మున్నగు భక్తురాండ్రకు రామకృష్ణుని దర్శన మీ సందర్భములో లభ్యమగుచుండెడిది. ఈ 'భానుపిషి' శారదాదేవి పుట్టింటికి సమీపమున వసించు గేస్తురాలు. 'పిషి' యనగ మేనత్త. శారదాదేవి సదా యామెను 'భానుపిషి' యనియే వరుస పెట్టి పిలుచుచుండెడిది. ఆమెవలన నిటీవల శారదాదేవి చరిత్రమునకు సంబంధించిన విశేషముల నెన్నిటినో తెలిసికొనుట కవకాశము కలిగినది. శ్రీరామకృష్ణు డత్తింటికి పోయినపుడెల్ల నాతనినిగూర్చి యత్తవారు పిచ్చి పెండ్లికొడుకు వచ్చినాడని హేళనగ వ్యవహరించుకొనువారట. రామకృష్ణుని నిర్యాణానంతరము అతని యత్తగారగు శ్యామసుందరీదేవి యాతని పటమునకు భక్తితో మ్రొక్కుచుండుట జూచి "బ్రతికియున్నన్నాళ్లును మీ యల్లునిగూర్చి పిచ్చి పెండ్లికొడుకని హేళనముగ ముచ్చటించెడి దానివే! ఆ పిచ్చి యల్లునే నేడు పూజించుచున్నావేమి?" అని యీ భానుపిషి వేళాకోళము చేసెడిదట. జయరామవటిలో పుట్టింటనున్నను రామకృష్ణుడు తనకా మాడు

నెలలలో ఇచ్చిన శిక్షణమునే మాతృదేవి సదా స్మరణకు దెచ్చుకొని ఎంతో శ్రద్ధతో నాచరించుచుండెడిది. అతని నగుమొగమును సమాధ్యవస్థయు ప్రశాంత భాషణములను అనుక్షణమును నామె ననుసరించుచుండెడివి. తాను చూచి నది కలగాదుగద! అంతటి మహోజ్జ్వల చరిత్రుడగు పురుషు డేమి? తనకు భర్తగ లభించుటేమి? ఆమె తన యదృష్ట మును తాను నమ్మలేకపోవుచుండెడిది.

స్త్రీలకు భర్తకంటె పరమదైవము లేడని మాతృదేవి మతము. భర్తకు భిన్నుడగు దైవము నిరాకరణీయుడనియే యామె నిశ్చయము. తరువాత నామెవలన నుపదేశముగై కొన్న యొక శిష్యుడు సన్న్యాసదీక్ష గైకొనవలెనని యత్నిం చుచు తన భార్య నాధ్యాత్మిక జీవితమున నొక యాటంక ముగ చూడసాగెను. ఆమె కెట్లయినను పరాధీనతను మాన్పి తనమీదనే తా నాధారపడునట్లు చేయవలెనని యాతని సంకల్పము. "నీకు నేను గావలెనా? భగవంతుడు గావలెనా?" అని యాత డొకనాడు భార్యను ప్రశ్నించెను. "నామీద నాధారపడెదవేల భగవంతునిపై నాధారపడు" మని బోధింపవలెనని యతని యుద్దేశము. ఆమె యేమియు బదులు పలుకక నిరుత్తరురాలయి యూరకుండెను. తరు వాత నామె మాతృదేవిని సమీపించి భర్త వైచిన ప్రశ్న నివేదించి దాని కేమి సమాధానము చెప్పవలసియుండునని యడిగెను. "తల్లీ! దాని కంత యాలోచించవలసినపని యేమున్నది? నాకు భర్తయే కావలెను. భగవంతు

డక్కర లేదని సమాధానము చెప్పలేకపోయితివా.'' అని దేవి సమాధానమిచ్చెను.

ఈ సమాధానములో నున్న పరమార్థమునే ఆమె తన జీవితమునకు సదా యాలంబనము గావించుకొనెను. ప్రాకృతుడు భర్తయయినపుడే ఆతనిని పరదైవముగ భావించుకొనవలెనని బోధించిన యీ పతివ్రతా తిలకము పరదైవమునే భర్తగ బడసి ఆతని యెడ నెట్టి లక్ష్యశుద్ధితో మెలగెడిదో వేరుగ విశదీకరింపవలెనా ?

## 4. దక్షిణేశ్వరయాత్ర

మరి నాలుగేండ్లు గడచినవి.

శారదాదేవికి తమ్ములును చెల్లెండ్రును గూడ నుండిరి. వీరినందఱను నా యాడించుచుండెడిది. జయరామవటిలో నూరు గడపలకంటె నెక్కువ లేవు. అందుచే గ్రామమంతయు నొక సమష్టి కుటుంబమువలె సంచరించుటకవకాశమున్నది. ఇరుగు పొరుగున నెవ్వారికే కష్టము వచ్చినను దయార్ద్ర హృదయయగు నామె కన్నీరు నించెడిది. ఎప్పుడో చిన్నప్పుడు వీధిబడికేగినను ఇప్పుడు పాఠశాలకుబోవు నవకాశము లేకుండెను. శ్రీరామకృష్ణుడు కొంత చదువు నేర్పెను. రామకృష్ణుని యన్న కుమార్తె యగు లక్ష్మీదేవియు నీమెయు బాలశిక్షలు మున్నగు పుస్తకములు పఠించుచుండగ హృదయరాముడు వచ్చి వారి చేతిలోని పుస్తకములు లాగుకొని "ఆడదానికి చదు

వెందులకు? నాకు తెలియును మీ యుద్దేశము. ఇక నవలలు నాటకములు నారంభింతురు గాబోలును.'' అని యాటంకములు కల్పించువాడు. కాని యామెకు చదువనగ మిగుల నాసక్తి. అందుచే నెట్లో రహస్యముగ చదువు సాగించుచునే యుండెడిది. మొత్తముమీద నామె సంపాదించిన చదువు రామాయణము భారతము మున్నగు పురాణములు చదువుట కుపయోగపడజాలినదిగ నుండెను. కాని యామె సంతకమయిన చేయలేకపోయెడిది. పెద్ద పెరిగిన తరువాత నొక శిష్యు డామె సంతకమును భద్రపరచుకొనగోరి యొక కాగితముపయి నామెను సంతకమును చేయుమని వేడెను. ఎంత ప్రయత్నించినను ఆమె సంతకము చేయలేకపోయినది.

వ్రాయలేక పోయినను ఆమె గొప్ప విద్యావతి. హృదయము నున్నత భూములకు గొనిపోవుటయే గ్రంథపఠనమునకు ప్రధాన ఫలితముగదా! అయినచో నామె హృదయము సంచరించిన యున్నత భూములలో సంచరింపగల మానవహృదయములు లోకమున నెన్ని యుండును? శ్రీరామకృష్ణుని సాంగత్యమునందలి అతిలోక మాధుర్యమును చవిచూచిన యామెకు ఎల్లపుడును శ్రీరామకృష్ణుల సాంగత్య మెట్లు లభించునా యన్న యాలోచనయే. ఆ మూడు నెలలో నంత యనురాగామృతమును వర్షించిన భర్త త న్నుపేక్షించునా? అసంభవము. తన్నెప్పుడు తోడ్కొని పోవలెనో అతనికి తెలియదా? అతని యాజ్ఞను ప్రతీక్షింపవలసినదేగాని తొందరపడరాదని యామె తన

మనస్సునకు బోధించుకొనుచుండెను. పరిశుద్ధములయిన యములు రెండు ఒక్కచో తారసిల్లి విడిపోయినపుడు పునస్సమాగమమునకయి యవిపొందు నారాటము వర్ణనాతీతము. శారదామాత యిట్టి యారాటమునకు గుఱియై బాధపడజొచ్చెను.

ఈ బాధకు మరియొక బాధగూడ జతపడెను. ఆమెను జూచి యూరిలో స్త్రీలందఱును శారదకు వినీ వినపడకుండ ఇట్లు గుసగుసలాడ జొచ్చిరి: "పిచ్చివాడట. వీధులలో బట్ట విప్పుకొని తిరుగునట! శ్మశానములకు బోయి ధ్యానించుకొనుచుండునట. అయ్యో! ఇట్టి బికారికి పెండ్లి చేసిరేమమ్మా" అని. ఈ గుసగుసలకు సహించుకొనలేక ఆమె పొరుగిండ్లకు బోవుట మానుకొన్నది. ఒకవేళ నెక్కడికైన పోవ బుద్ధి పుట్టినా భానుపిషి యొద్దకు మాత్రము పోయి వారింట కొంతసేపు తన చెంగు పరచుకొని పరుండెడిది.

కొంతకాలమునకు ప్రశాంత గంభీరమగు నామె మనస్సులో కెరటములు లేచినవి. ఊరిలో నందఱు తన భర్త యస్వస్థుడనికదా చెప్పుకొనుచున్నారు. అది నిజమే యయినచో తాను వారికి సేవచేయుచు చెంతనే యుండవలెనుగాని పుట్టింటనుండుట ఎంతవరకు సమంజసము? లోపల భర్త సన్నిధిని చేరుకొనవలెనను తహతహ వేగిరపెట్టుచున్నది. కాని బిడియము వచ్చి నోటికి తాళము వేయుచున్నది. ఏమిగతి?

ఆ సమయమున నామె బంధువులు కొందఱు చైతన్య దేవుని జన్మదిన మహోత్సవమున కలకత్తాకు బోయి గంగా స్నానముచేయ సంకల్పించిరి. వారితో బాటు తానును ప్రయాణమగుదునని యామె తండ్రిగారితో జెప్పించెను. రామచంద్రు డామె హృదయ భావమును గ్రహించి యడ్డు చెప్పక తానుకూడ బయలుదేరెను. (1872 మార్చి)

ఈ యాత్రికబృందము మున్ముందు మిక్కిలి సౌఖ్యముగనే ప్రయాణము చేసినది. మార్గమున కిరుప్రక్కల నున్న వృక్షములును వారికి చల్లని నీడనిచ్చినవి. పచ్చని వరిపైరులు వారి కన్నుల కింపుగొలిపినవి. కమలినీ కల్హార ములపైనుండి వచ్చు మంద పవనములు వారి ప్రయాణ శ్రమ మపనయించుచుండెను. ఇట్లు రెండు మూడు దినములు గడచినవి. అదివర కెన్నడు నిల్లు కదలని సుకుమారి కాలినడకను అరువది మైళ్ళు పోవలసి యుండెను. శ్రమ సహించుకొనలేక నడుమ తీవ్రమయిన జ్వరము వచ్చెను. ఒడలు తెలియక యామె యొక సత్రమున బరుండి యుండెను. తక్కినవారుకూడ ఆమెతో బాటే యాగిపో వలసి వచ్చెను.

ఈ సందర్భమున గలిగిన దివ్యానుభూతి నొక దానిని గూర్చి యామె తరువాత తన శిష్యుల కిట్లు చెప్పినది. "నాకప్పుడు దేహస్పృహ యేమాత్రము లేకుండెను. నా ప్రక్కనే యొక స్త్రీ కూర్చున్నట్లయినది. ఆమె మిక్కిలి నల్లగ నున్నదిగాని యట్టి యపురూప సౌందర్య

మును నే నెన్నడును జూచియెరుగను. కోమలమైన చల్లని తనచేతితో నామె నా శిరస్సు నిమురుచుండెను. దీనివలన నా తాపము శాంతించెను. "అమ్మా! నీ వెక్కడనుండి వచ్చుచుంటివి?" అని నే నామెను ప్రశ్నించితిని. "దక్షిణేశ్వరమునుండి" అని యామె బదులుపలికెను. నేనుకూడ దక్షిణేశ్వరమునకే భర్తగారి పాదసేవ చేయునిమిత్తము పోవుచుంటి ననియు మార్గమధ్యమున నీ పాపపుజ్వర మడ్డు వచ్చిన దనియు ఆమెతో జెప్పితిని. "నీ నిమిత్తమే నీ భర్త నచ్చట నిలిపితిని. ఆరాటపడకుము. త్వరలో జ్వరము తగ్గిపోవును. తప్పకుండ దక్షిణేశ్వరము చేరుకొని భర్తృ సందర్శనము బడసెదవు" అని యామె అభయ హస్త మిచ్చెను. 'ఇట్టి యకారణబాంధవ్యము నెరపు నీ వెవరు తల్లీ?' 'నీ సోదరిని.' ఇంతలో నిద్ర ముంచుకొని వచ్చినది. తరువాత నేమి జరిగినదో తెలియదు."

ఈ యనుభూతివలన నామె కెంతో బలమును ఉత్సాహమును చేకూరినవి. జ్వరము వెంటనే నిష్క్రమించెను. ఎందుకయినను మంచిదని ఒక పల్లకీ కుదుర్చుకొని శారద నందు గూర్చుండబెట్టి తక్కిన ప్రయాణమును సాగించిరి.

ఈ యాత్రిక బృందము దక్షిణేశ్వరము చేరుకొను సరికి రాత్రి తొమ్మిదిగంటలు కావచ్చినది. తక్కిన వారందఱు నహబత్ ఖానాలో నున్న చంద్రమణీదేవి యొద్దకు బోయిరి. గాని శారదకు మాత్రము మనస్సొప్పక తిన్నగ రామకృష్ణుని గదిలోనికే బోయెను. ఆమె వచ్చునని రామ

కృష్ణునకు ముందుగ తెలియదు. కాని యామెను జూడ గనే యాతడు వర్షించిన యనురాగమునకు మేర లేకుండెను. "అయ్యో! వచ్చుసరికి మధురానాథుడు లేకపోయినాడు. నా కుడిభుజము పడిపోయినది. నేనేమి చేయుదును? అతడే యున్నచో మిమ్మెంతగ గౌరవించి సదుపాయము లొనర్చి యుండును!" అని యాతడు బాధ పడజొచ్చెను. ఈ మధురానాథుడు దక్షిణేశ్వరాలయమును గట్టించిన రాణీ 'రాసమణి' యల్లుడు. ఈతనికి రామకృష్ణుడనిన నపార మయిన భక్తి. అతని నిమిత్తమయి ఎంత ధనమయిన వెచ్చించువాడు. అప్పటి కే డెనిమిది నెలలకు పూర్వమే యాతడు పరమపదించెను.

భర్త యుపచారవాక్యములే శారదామణి కమృతోపమానములుగ నుండెను. ఒక వృద్ధదాసిని తోడు చేసికొని ఆమె యా రాత్రి రామకృష్ణుని గదిలోనే పరుండెను. తగిన చికిత్స చేయింపగ నాలుగయిదు రోజులలో జ్వరము నిశ్శేషమాయెను.

భర్తను జూచిన వెనుక 'వీరినేనా జనులు పిచ్చివాడనుట' అని యామె యాశ్చర్యపడజొచ్చినది. అక్కడనే నిలిచి అత్తగారికిని భర్తగారికిని నామె సేవచేయదలచుకొన్నది. ఆమె నిశ్చయము నెఱిగి తండ్రి సంతోషించి ఆమె నక్కడనే దిగవిడిచి తాను వెంటనే ప్రయాణమయి స్వగ్రామమునకు బోయెను.

ఈ సందర్భమున "దక్షిణేశ్వరమునకు నీవు వచ్చుట కిదే ప్రథమతరుణముగదా! వర్జ్యకాలమున నడుగుపెట్ట లేదుగద?" అని రామకృష్ణులు ప్రశ్నించినారట. "వర్జ్యము దారిలోనే గడచిపోయినది. నేను చూచుకొనుచునే యున్నాను." అని యామె బదులు పలికెనట. ఈ యుదంతము విభూతివిభూషణఘోషుతో నామెయే చెప్పినదగుటచే విశ్వాసయోగ్యము. శారదా రామకృష్ణులకు వర్జ్యము మున్నగువానియందు విశ్వాసముండినట్లు ఇది నిరూపించుచున్నది.

## 5. ఇహలోక వైకుంఠము

దక్షిణేశ్వరమున రాణీరాసమణి నిర్మించిన కాళీకాలయమున్న ప్రదేశము మిక్కిలి రమణీయమైనది. దీని యడుగులను గడుగుచు ప్రవహించు గంగానదినుండి వీచు మందపవనములు ఇచ్చట సదా సంచరించుచు చల్లదనమును వర్షించుచుండును. పువ్వుల మొక్కలతో—చెరువులతో—నాలయములతో—నాలయములను దర్శింపవచ్చు సాధుపుంగవులతో—నిడి హృదయమలరించును.

ఇట్టి రమణీయప్రదేశమున శారదా రామకృష్ణుల పునస్సంధాన మహోత్సవము నడచినది.

1859 లో వారి వివాహము. అప్పటినుండి యిప్పటికించుమించు పదమూడు సంవత్సరములు గతించినవి.

ఈలోపున శ్రీరామకృష్ణుడు ఆధ్యాత్మిక సామ్రాజ్యమున కేకచ్ఛత్రాధిపత్యము సంపాదించుకొనెను. మరి శారదాదేవి నాతడు విస్మరించినాడా ?

వివాహ సమయముననే, "అమ్మా! నా భార్య మనస్సునుండి ఇంద్రియవాంఛలను పూర్ణముగ తొలగింపుము" అని యాతడు కాళీకామాతను ప్రార్థించెనట. తానీ పదమూడేడులు చేసిన సాధనవినియోగమేమి? శారద సాక్షాత్తు జగదీశ్వరీస్వరూపమని గుర్తించి యానందించుటయే. అనగా బాహ్యదృష్టినిబట్టి యామెకు దూరముగానున్నను—ఆమె సాహచర్యము ననుభవింపకపోయినను—ఆంతరంగికముగ ననుక్షణమును నామె యథార్థస్వరూపమునే యనుసంధించుచున్నాడు.

శారదాదేవికూడ ఈ నాలుగేడులును తన హృదయము పదనుపరచుచున్నది. దేహము జయరామవటిలోనున్నను పదునాలుగేడుల వయసున గలసికొన్నపు డాతడిచ్చిన శిక్షణమును వినియోగించుకొనుచు హృదయము దక్షిణేశ్వరమున రామకృష్ణుల సన్నిధినే యున్నది.

దక్షిణేశ్వరమున వారు తారసిల్లుసరికి ఒకరి శీలసంపదలో నున్న మాధుర్యము నింకొకరు గ్రోలుటకు పూర్ణముగ సంసిద్ధులయియుండిరి. పునస్సంధానసమయమున కింత సంసిద్ధులయియున్న దంపతులు ప్రపంచమున నెప్పుడైన నుండిరేమో, ప్రపంచచరిత్ర గాలించిచూడవలసియున్నది.

శారదా దేవిని చూడగనే తపస్సు చెరచుటకు వచ్చిన విఘ్నకర్త్రిగ నాతడెన్నడు భావింపలేదు. తన యాధ్యాత్మిక సౌధమునకు బునాది కట్టుదిట్టముగ నున్నదో లేదో పరీక్షించుకొన వచ్చునుగదాయని సంతసించెను. తనతో సంసారమును చేయడేమని యామె యెన్నడును గొణుగుకొన లేదు. ఆమెకు సంసారవాంఛ యున్నచోగదా?

"నేను నిన్ను ప్రమాణముచేసి వివాహము చేసికొన్నాను. నీకు కోరికయున్నచో నీతో సంసారము చేయవలసినదే" అని యాతడు తన సంసిద్ధతను దెలిపెను. తన్నాతడు పరీక్షించుచున్నాడని యామె గ్రహించి, "నేను మీ సహధర్మచారిణినిగానా? మీకు లేని కోరిక నాకెందుల కుండును" అని యామె ప్రత్యుత్తర మిచ్చెను.

ఇంద్రియముల కతీతులయి వర్తించుట ఆ దంపతులకు సహజసంపద. దానిని ప్రయత్నించి వారు సాధింపలేదు. అమృతకలశ మఱచేతనుండగ విషపాత్రకయి వెదకికొనువారుందురా?

రామకృష్ణుడు శారదయు ఒకే శయ్యపై నిద్రించుచుండిరి. ఒకరి శరీర మొకరికి తాకుచుండెను. కాని మనస్సులో కామాంకురముకూడ లేకుండెను. ఇట్లొకటి రెండు దినములుకాదు. ఆఱు నెలలు అగ్నిపరీక్షకాగిరి. ఇందు రామకృష్ణుని గొప్పదనమేగాక శారద గొప్పదనము కూడ ప్రత్యక్షమగుచున్నది. "ఆమె మనస్సులో లవమైన

కామమున్నచో నేనుగూడ పతితుడనయియుందును" అని రామకృష్ణుడే మెచ్చుకొన్నాడు.

ఒకసారి శారదాదేవి నిద్రించుచున్నది. ఆమె ప్రక్కనే పరుండిన రామకృష్ణుడు లేచి, "మనసా! లోకు లందఱును భార్యతో సంభోగించుటయే పరమానందముగ నెంచుచుందురు. ఆ యానందమిపుడు నీకు గరతలామలకము కానున్నది. లోపల నొకటిపై నొకటి వద్దు. కావలసిన యథేచ్ఛగ కామసౌఖ్యము ననుభవింపు"మని యామె పయి జేయివేయబోయెను. చేయి ముందుకు సాగలేదు. మనస్సు సమాధిమగ్నమయ్యెను. తెల్లవారిన తరువాత నాతనికి దేహస్పృహ కలిగించుటకు శ్రమపడి ప్రయత్నింప వలసివచ్చినది.

దంపతులిరువురును కాళికాదేవికి చెలికత్తెల మను కొనుచుండువారట. రామకృష్ణుని కాడు వేషమువేసి యాడువారి కుచితములయిన యాభరణములతో శారదా దేవి యలంకరించుచుండెడిదట. అపుడు రామకృష్ణుడు తన్మయుడై సమాధిమగ్నుడగు చుండెడివాడట.

ఒక్కమారు మాత్రము ఎవ్వరో ప్రోత్సహింపగ "గృహస్థ ధర్మమునకు సంతానమేగదా ప్రధాన ఫలము? అది లేనినాడు మన గృహస్థ జీవితము సఫలమనిపించు కొనునా?" యని యామె ప్రశ్నించినదట. "ఒక్కరు నిద్దఱుకాదు. నీ సంతాన మీ భూమండలమంతయు

వ్యాపించియుండును.” అని యాతడు ప్రత్యుత్తర మిచ్చె నట. పై ప్రశ్న మామె ఇతరుల ప్రోత్సాహముచే వేసినది గాని ఆమెకు స్వబుద్ధిచే నుదయించినది కాదు.

ఇక్కడకు రామకృష్ణుడు శారదను బరీక్షించినాడు. తన మనస్సును బరీక్షించుకొన్నాడు. ఇక శారద రామ కృష్ణుని బరీక్షించుచున్నది. ఒకనాడు పాదములొత్తుచు బ్రశ్నించినదట. “నేను మీ కెట్లు గనవచ్చుచున్నాను?” అని. రామకృష్ణుడు ప్రత్యుత్తరము నిమిత్త మొక్క నిముసమైన తడవుకొనలేదు. “ఆలయములోనున్న కాళికా మాతయే నహబత్ ఖానాలో మా యమ్మయగు చంద్ర మణీదేవి రూపమున బ్రత్యక్షమగుచున్నది. ఆమెయే ఈ రూపమున నిప్పుడు నాకు పాదము లొత్తుచున్నది.”

## 6. కృతిస్వీకరణము

1873 వ సంవత్సరము మెయి నెల 25 వ తేదీ. ఆ దినము దక్షిణేశ్వరాలయమున ఫలహారిణీ కాళీపూజ జరుగు చున్నది. ఫలహారిణి యనగా కర్మఫలమును హరించునది. ఎక్కడ చూచినను జనసమూహము క్రిక్కిరిసియున్నది. ‘అమ్మా,’ ‘అమ్మా,’ యనుచు లెంపలు వేసికొనువారు భజనలు చేయువారు-చేతులతో తాళము వేయుచు కీర్త నలు పాడువారు-కోలాహలముగ నుండెను.

శ్రీరామకృష్ణుని గది తలుపులు మూయబడియున్నవి. దూరపు బంధువయిన ‘దిను’ అను కుఱ్ఱవాడు బిల్వదళ

ములు తెచ్చినాడు. హృదయరాముడు పూజకు కావలసిన సామగ్రినంతయు ఆయత్తముచేసినాడు. శారదా దేవికి కబురుపెట్టగా నామె వచ్చినతరువాత నా దంపతుల నొంటరిగ వదలి హృదయరాముడును తక్కినవారును తప్పుకొన్నారు.

రామకృష్ణుడు చేసన్నచేయగ నామె యాసనమున పడమటి ముఖముగ గూర్చున్నది. ఆమె నాడు కూర్చున్న పీట యిప్పటికిని బేలూరు మఠమున జాగ్రత్త పెట్టినారు. ఆమె కభిముఖుడయి రామకృష్ణుడు కూర్చున్నాడు. పీటమీద శ్రీయంత్రమున్నది. గదిలో ప్రవేశించుసరికే శారద ఉన్నతమైన యాధ్యాత్మిక భూములలోఁ బ్రవేశించినది. ఆ మంత్రముపై గూర్చుండుసరికి ఇంచుమించుగ నామెకు దేహస్పృహ లేదు. "ఓ జగదీశ్వరీ! నిత్యకౌమారీ! సర్వశక్తినిలయా! సర్వసౌందర్యనిధానా! నాకు బ్రసన్నురాలవయి మోక్షద్వారమును దెరువుము. ఈ నా యెదుట నాసీనురాలయియున్న వ్యక్తి మనోదేహములను పూతముగావించి యీమె ముఖమున నాకు బ్రత్యక్షమయి మంగళము లొసంగుము." అను నర్థమిచ్చు మంత్రములను శ్రీరామకృష్ణుడు పఠించెను.

అనంతరము న్యాసపూర్వకముగ నామెకును దేవికిని ఐక్యమును సంధానించెను. అనురూపములయిన మంత్రములతో నాయా యవయవములను స్పృశించెను. స్పృశించునపుడు దేవి యవయవములుగానే భావించుచుండెను. తరు

వాత షోడశోపచార పూజగావించెను. చరణములకు లత్తుక పూయుట, నుదుట తిలకముంచుట, నూతన వస్త్రముతో నాచ్ఛాదించుట ఈ షోడశోపచారపూజలోని యంగములు; వీనినన్నిటిని అతడు స్వయముగ జేసెను. తాంబూలము నోటనుంచి నైవేద్యము తినిపించెను. తరువాత నీ విషయమును గూర్చి ప్రసంగము వచ్చినపుడు లక్ష్మీదీదీ "అమ్మా! నీకు ఎంతో బిడియముగదా! ఆతడీ తీరున నిన్ను పూజించుచుండగ లజ్జ ముంచుకొనిరాలేదా?" అని ప్రశ్నింపగ "వారు ఈ యుపచారములు చేయుట గుర్తున్నది కాని ఎందుచేతనో నాకు మాటాడుటకు బుద్ధి పుట్టకుండెను." అని యామె ప్రత్యుత్తరమిచ్చెను.

ఈ పూజ జరుగుచున్నంతసేపును ఆమెకు పూర్ణమైన దేహస్పృహ లేదు. పూజ ముగియుసరికి గాఢమైన సమాధిలో ప్రవేశించెను. ఈ యత్యున్నత మానసిక స్థితిలో సతీపతులు సచ్చిదానంద స్వరూపమున నేకీభవించిరి.

రాత్రి మిక్కిలి యతిక్రమించిన తరువాత పరమహంసకు కొంచెము దేహస్పృహ వచ్చెను. అప్పు డాతడు తన్నుతాను దేవికి సంపూర్ణముగ సమర్పించుకొనెను. తన యెదుట శారదాదేవిలో మూర్తీభవించిన ఆమె పాదముల కడ తన జపమాలిక నుంచి తన సాధన ఫలము నంతను ఆమె కర్పించెను. తన పేరు నొక బిల్వదళముపై వ్రాసి

అది ఆమె పాదముల కడనుంచెను. తన్ను తన సర్వస్వ మునుగూడ ఆమె కర్పణముచేసికొని

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే! శివే! సర్వార్థసాధికే! ।
శరణ్యే! త్ర్యంబకే! దేవి! నారాయణి! నమో஽స్తుతే!॥

అను మంత్రమును బఠించెను. ఈ పూజను షోడశీపూజయని తాంత్రికులు వ్యవహరింతురు. పూజితయగు స్త్రీకి పదునాఱు వత్సరముల వయస్సే కానక్కఱలేదు. మంచి యౌవన వతియు, అపురూపసౌందర్యవతియునై యుండవలెను. దశ మహావిద్యలలోను ఈషోడశి యొక్కతె.

శారదా రామకృష్ణుల జీవితమున నీషోడశీ పూజతో నుపమింపదగిన యుదంతము వేఱొకటి లేదు. ప్రాకృత ధనికులు తమ భార్యలకు నగలు చేయించి యిత్తురు. పట్టు చీరలతో బహూకరింతురు. అంతేగాని యాధ్యాత్మిసంపద నీయజాలరు. ఇక్కడ రామకృష్ణుడు ఆత్మసామ్రాజ్యమునకు చక్రవర్తిగావున ఆమెను తనతో సరిగద్దెనెక్కించెను. ఆమెకు పాదాక్రాంతుడయి తన సంపదనంతను ధార వోసెను. ఆమెపాదములకడ నుంచినది స్థూలమైన జపమాలిక మాత్రమే కాదు. తన యనుభూతులతో గ్రుచ్చిన యపు రూపమైన రత్నహారము. రామకృష్ణుని జీవితము త్రిజగ న్మోహనమయిన మధురకావ్యము. దాని నా దినమున నాతడు శారదాదేవి కంకితముచేసినాడు.

అయిదేండ్ల బాలికగ నున్నప్పు డామెను జూచి, "ఈమె నా యాధ్యాత్మికసంపదకు పట్టపురాణి కాదగినంత యున్నతస్థితికి వచ్చు" నని యంచనావేసెను. రామబాణమైన లక్ష్యమును తప్పవచ్చునుగాని అతని యంచనా ఎన్నడును తప్పినదిలేదు. అతని శిష్యుల చరిత్రములన్నియు నిందులకు నిదర్శనములే.

దక్షిణేశ్వరమునకు వచ్చినతరువాత ఆమె మానసికాభివృద్ధిని తిలకించి యాతడు తల యూచియుండవలెను. "అనుకొన్న మెట్టున కీమె వచ్చినది," అని లోలోపల సంతసించియుండవలెను. ఇంక తన సర్వస్వమును ఆమెకు సమర్పించుపట్ల సంకోచమేల ?

అలౌకిక సౌందర్యముతో నిండిన యాతని జీవిత కావ్యము నామె స్వీకరించినది. తాను సొంతముగ నేసాధనయు చేయకుండగనే ఆతడు సాధన సోపానములతో నిర్మించిన దివ్య సౌధము నధిష్ఠించినది. భర్త సంపాదన యంతయు భార్యదేకదా !

శారదాదేవిపట్ల రామకృష్ణున కెంత యనురాగమున్నదో ఎంత ప్రపత్తి భావమో స్థాపించుటకు నీయొక్కయుదంతమే చాలును. చేసిన సాధనయంతయు తన మోక్షమునకయిగాక లోకము నుద్ధరించుటకే యాతడు చేసెను. అయినను సాధించిన సత్యములను తాను స్వయముగ లోకమునకు పంచిపెట్టలేదు. శిష్యమండలికి వాని నందించి వారిచే తన యనంతరము లోకమున వ్యాపింప

జేసినాడు. అట్లు వ్యాప్తమొనరించిన వ్యక్తులలో శారదాదేవిని జెప్పిన తరువాత మరియొకరిని జెప్పవలసియున్నది.

## 7. సింహవాహిని

షోడశీపూజ జరిగిన నాలుగు నెలలకు అనగా 1874వ సంవత్సరము మధ్య మాతృదేవి మరల జయరామవటి కేగెను. ఈ సంవత్సరముననే శ్రీరామకృష్ణుని ద్వితీయ సోదరుడగు రామేశ్వరుడు పరమపదించెను. శ్రీరామనవమి రోజున కాళీకుమారుడను తృతీయ పుత్త్రునికి వడుగుచేసి వడుగులో నాలుగవరోజున శారదాదేవి తండ్రియగు రామచంద్రముఖర్జీ దివికేగెను. తన తండ్రి వియోగము పితృవత్సలయగు మాతృదేవి కెంత దుస్సహముగ నుండెనో వేఱుగ వర్ణింపవలెనా? దానిని మఱచిపోవుటకయి యామె 1874లో దక్షిణేశ్వరము వచ్చి మామూలుగ చంద్రమణీదేవితో బాటు నహబత్ ఖానాలోనే యుండెను.

ఆలయమునకు సమీపమున నొక చిన్న నివేశనస్థలమును సంపాదించిరి. ఈ స్థలము నెవ్వరు సంపాదించిరి అను నంశమునుగూర్చి యభిప్రాయభేదమున్నను శారదానందులు రచించిన లీలా ప్రసంగము ననుసరించి 'శంభుమల్లిక్' అను భక్తుడు రు. 250–0–0 లు ఖర్చుపెట్టి ఆ స్థలము నద్దెకుతీసికొన్నట్లు గనవచ్చుచున్నది. విశ్వనాధ ఉపాధ్యాయుడను భక్తుడు నేపాల్ గవర్నమెంటువారికి కలకత్తాలో ఏజంటుగా నుండెను. అతడిచ్చిన కలపతో

నక్కడ నొక కుటీరమును నిర్మించిరి. ఈ కుటీరమున మాతృదేవి ఒక సంవత్సరము మాత్రమే వసించినట్లు గన వచ్చుచున్నది. పూటపూట రామకృష్ణునకు భోజనము తయారుచేసి ఆమెయే స్వయముగ దీసికొనిపోయి తినిపించె డిది. ఆమెకు హృదయానందకరముగ నుండుటకును ఆమె యోగక్షేమములు కనుగొనుటకును దినమున కొక్కసారి మధ్యాహ్నసమయమున రామకృష్ణు డక్కడికి వచ్చువాడు. రాత్రులెన్నడు నటవసించువాడుకాడు. కాని ఒక సాయం సమయమున గాలివాన మిక్కుటముగ నుండుటచే రాత్రి యక్కడనే భోజనముచేసి పండుకొనవలసివచ్చినది. "కాళి కాలయములోని పూజారులందఱును తమ యిండ్లకుబోయి పండుకొనరా? అట్లే నేనును ఈ రాత్రి యిచ్చట బండు కొందును" అని పరిహాసముగ నాతడు పలుకువాడు. ఇట్లొక సంవత్సరము దాటకుండగనే రామకృష్ణులకు గ్రహణి సోకుటచే నాతని సేవనిమిత్త మా కుటీరమును వదలి యామె 'నహబత్ ఖానా'కు రావలసివచ్చినది. ఆమె మరల నా కుటీరమున కెందుకు పోలేదో కారణము తెలియదు.

రామకృష్ణునకు గ్రహణి శాంతించినను అది మాతృ దేవికి సోకినది. శంభుమల్లిక్ సాహాయ్యమున చికిత్సే కేర్పాటు గావింపగా నది కొంత శాంతించెను. 1875లో నామె మరల పుట్టింటికేగినపు డీవ్యాధి మిక్కిలి తీవ్రరూప మున నామెను బాధించెను. అపు డామె జీవితమునుగూర్చి యాశ వదులుకొనిరి. దక్షిణేశ్వరమున నున్న శ్రీ రామకృష్ణు

డీ వార్త విని, "రాకపోకల శ్రమకేనా ఆమె యీ లోక మునకు వచ్చినది? మానవజీవితమునందలి పరమార్థమును సాధించుట కామె నోచిపుట్టలేదా?" అని హృదయుని మెడ పట్టుకొని యేడ్చెను.

ఈ సందర్భమున శంకానివృత్తి కొరకు చెరువు ప్రక్కకు బోయి నీరసముచే నా చెరువుప్రక్కనే చెంగు పరచుకొని యామె పరుండెను. అప్పుడు తన నీడను చెరువులో జూచుకొని దేహము వట్టి యస్థిపంజరమైపోయినదని యామెకనిపెట్టి అంతతో దేహము జాలింపవలెననికూడ నను కొన్నది. కాని భాగ్యవశమున నా సంకల్పముదృఢపడలేదు.

అప్పు డామె తిన్నగ బోయి గ్రామమున నున్న సింహవాహినీదేవి యాలయమున ప్రాయోపవేశము చేసెను. అవిలంఘనీయములైన సన్నివేశములు తటస్థించినపుడు దేవాలయములకు బోయి ప్రాయోపవేశము పరుండుట యొక యాచారముగదా! అప్పు డామెను బాధించుకొని తిను చున్నవి రెండు వ్యాధులు. గ్రహిణియేకాక కండ్లనుండి నిరంతర ధారగ నీరు కారజొచ్చెను. కండ్లుపోవునా యని కూడ యనిపించినది. అయిదు నిమిషము లామె ప్రాయోప వేశము పరున్నదో లేదో కండ్లజబ్బునకొరక మూలిక యామె కును గ్రహణికి మందు ఆమె తల్లికిని సింహవాహిని స్వప్న ములో నుపదేశించినది. అవి యుపయోగింపగా నామె స్వస్థురాలయ్యెను. అప్పటినుండియు సింహవాహినీదేవి మహిమ మా చుట్టుపట్టుల వ్యాపించి గుంపులు గుంపులుగ

వచ్చి ప్రజలక్కడి మట్టి నుపయోగించి అనేక రోగములు శాంతింపజేసికొనుచుందురు.

గణేంద్రనాథ బ్రహ్మచారిగారీ సందర్భమున రెండుదంతములు పేర్కొనుచున్నారు :—

దేవిపుట్టింట నొక పశులకాపరి యుండెను. ఈతని నొకసారి పాము కరచినది. ఈ సింహవాహినిగుడి ప్రక్కను మట్టినిదీసి పాము కరచిన స్థలమున రాయగ నాతడు పునర్జీవమును బడసెనట. (ఇది విభూతిభూషణఘోషుగారి వల్ల వినిన యుదంతము). మాతృదేవి మేనల్లుడగు 'భూదేవు' నకు పాము కరచినది. మాతృదేవియే సింహవాహినిగుడి సమీపమున మట్టిని పాము కరచినచోట రాయగ నాతడు నిరపాయముగ బ్రతికినాడు. "చిడుముతప్ప దేహమునకు తగిలిన ఎట్టి గాయములనుగాని సింహవాహినిగుడి మట్టి మాన్పగల"దని మాతృదేవి చెప్పెడిదట. 1952 డిసెంబరులో ప్రకృతరచయిత జయరామవటికి బోయినపుడు అక్కడి స్వాములు ఈ సింహవాహినిగుడి యున్న స్థలమును జూపినారు. గుడి శిథిలమైపోయినది. కాని అక్కడి మట్టిని తేలుకుట్టుకు పాముకాటుకు మందుగ నిప్పటికి నుపయోగింతురని ఆ ప్రదేశమును చూపిన స్వామి చెప్పెను.

## 8. *జగద్ధాత్రీపూజాప్రారంభము*

రామచంద్రముఖర్జీ చనిపోయిన తరువాత నాతని కుటుంబము నిరాధారమైపోయెను. పౌరోహిత్యము చేసి

యూత డార్జించు సంపాదనము కట్టువడిపోయెను. అయిన యజమాని లేకపోవుటచే భూములనుండి మక్తాకూడ సరిగా వసూలు కాకుండెను.

ఈ సందర్భమున శ్యామసుందరీదేవి చాకచక్యము మెచ్చుకొనదగినది. తన నలువురు కొమాళ్ళను నలువురు బంధువుల కొప్పగించెను. ప్రక్కనున్న బానర్జీలు మిక్కిలి ధనికులు. వారి యింట ధాన్యము తెచ్చి వానిని బియ్య ముగా జేసి యిచ్చుచుండెను. మన గ్రామములలోవలె దంపుగాక ఒక చిన్న కఱ్ఱమర నుపయోగించి బంగాళీలు ధాన్యమునొలిచి బియ్యముగా జేసికొందురు. ఆమె మిక్కిలి బలశాలిగనుక రోజునకెంతో శ్రమపడుచుండెను. ఈ శ్రమలో చాల భాగము మాతృదేవికూడ పంచుకొను చుండెను. శ్యామసుందరీదేవి యమాయకురా లగుటచే ఆమెకు తరచు సమయోచితములైన సలహాలనిచ్చి మాతృ దేవి కుటుంబమర్యాద గాపాడుచుండెను.

నవముఖర్జీయనువాని యింట కాళీపూజ జరుగు చుండగ దేవి కర్పించునిమిత్తము శ్యామసుందరి బియ్య మును బంపించెను. అదివరకున్న కుటుంబ కలహములను బురస్కరించుకొని యా ముఖర్జీ యా బియ్యమును దేవి కర్పింపక తిరుగగొట్టెను. అమాయకురాలగు శ్యామసుందరి యది దేవి నిరాకరణగానే భావించి రాత్రియంతయు నేడ్చు చుండెను. ఇంతలో తరుణ సూర్యబింబమును ధిక్కరించు మేనిచాయతో పద్మాసనమువైచుకొని గూర్చున్న యొక

దేవత యామెకు గలలో గనుపించి "ఆ బియ్యము నా కిమ్ము నేను స్వీకరింతును" అని బ్రతిమాలెను. "ఎవరు నీవు" అని ప్రశ్నించగ నేను "జగద్ధాత్రిని" అని ప్రత్యుత్తరమిచ్చి, యామె యంతర్ధానమాయెను. ఈ సంగతి శారదాదేవితో జెప్పగ నిరువురు నుత్సాహపడి జగద్ధాత్రీపూజకు సంకల్పించిరి.

రెండు "ఆరా"ల ధాన్యమును ఎండబోయవలెననుకొనుచుండగ వర్షములు పట్టుకొని ఎక్కడను అవకాశము లేకుండజేసెను. ('ఆరా' యనునది బంగాళీ మానము) వారు నిరుత్సాహపడిరిగాని ఇంతలో తలవని తలంపుగ నెండవచ్చి ధాన్యమెండుటకును జగద్ధాత్రీవిగ్రహము రేగడిమన్నుతో తయారుచేయుటకునుగూడ నవకాశమొసంగెను. తన తాహతుకు మించిన వైభవముతో నా పూజను నిర్వహించి విగ్రహమును విసర్జించుచు "అమ్మాయి! జగాయీ! (జగద్ధాత్రికి ముద్దుపేరు) వచ్చేయేడు మరలరావే. నీకు మరింత వైభవముగ పూజ చేసెదను" అని శ్యామసుందరీదేవి సాగనంపెను.

మరుచటి సంవత్సర మీపూజ మాట తలపెట్టగ శారదాదేవి యామెను నిరుత్సాహపరచుచు, "అమ్మా! ఒక సంవత్సరము చేసితిమి చాలదా? జరుగుబడి లేనపుడు మరల కాళ్ళు విరుగద్రొక్కుకొననేల?" అని వారించెను. ఆ రాత్రి శారదాదేవికి గలలో మూడు విగ్రహములు గానవచ్చెను. అందొకటి జగద్ధాత్రీదేవిది. ఆ తక్కిన

యిద్దరును జయ విజయలను నామె చెలికత్తెలు. "మాకు సెలవా?" అని మాతృదేవి నడిగినట్లాయెను. "మీరు పోవద్దు. ఉండుడు. మీకు తప్పక పూజ యేర్పాటు చేసెదను" అని చెప్పి కలనుండి మేల్కాంచి యామె తన తల్లితో యావద్వృత్తాంతమును దెలిపెను. నాటినుండియు జయరామ వటిలో ప్రతి సంవత్సరము జగద్ధాత్రీపూజ జరుగవలసినదే.

శారదాదేవి జీవితకాలములో నామె యీ పూజ నిమిత్తము ప్రతి సంవత్సరము 'జయరామవటి' పోవు చుండెడిది. వంటపాత్రలను పూజాపాత్రలను తానే స్వయముగ తోమెడిది. కొంత భూమిని కొని శారదానందులు ఈ జగద్ధాత్రీ పూజకు ప్రత్యేకించిరి. ఆ భూమి యిప్పుడు మాతృదేవి సోదరుల సంతతియాధీనమందున్నది. కాని వారికిని శారదానందులకును నడచిన ఏర్పాటుప్రకారము జగద్ధాత్రీపూజకయి ప్రతిసంవత్సరము వారు కొంత ధాన్య మీయవలసి యుండును.

ఇప్పటికిని శారదాదేవి నిర్మించిన యాలయపక్షమున జగద్ధాత్రీపూజకు రావలసినదిగ భక్తుల కాహ్వానము ఏటేట వచ్చుచుండును. ఈ జగద్ధాత్రీపూజ శారదాదేవికి ప్రత్యేకముగ నభిమానాస్పదమగుటచే దానికొక యధ్యాయము వినియోగించు టావశ్యకమాయెను.

## 9. సాధన; ఉపలబ్ధి

1872 మార్చి మొదలుకొని శ్రీరామకృష్ణుడు నిష్క్రమించిన 1886 ఆగస్టు వరకు దీసికొన్నచో శారదాదేవి

జీవితమున బాహ్యోదంతములంతగ గనుపింపవు. నడుమ నడుమ కొన్నాళ్ళు పుట్టినింటికి జయరామవటి పోయివచ్చుట తక్కతక్కిన కాలమునంతను రామకృష్ణుని శుశ్రూషలోనే గడపెను. ఈ కాలమునకంతకును 'గురుశుశ్రూష'యనియే మనము నామకరణము చేయవచ్చును.

ఈ కాలమున గురుచరణసన్నిధిని కఠోరమైన సాధన జరిపినది. ఆమె యవతారమూర్తియని విశ్వాసమున్నవారి కిది విపరీతముగ దోచవచ్చును. ఆమెకుగూడ సాధన మావశ్యకమా? అని వారు ప్రశ్నింపవచ్చును.

అవతారముల ముఖ్యప్రయోజనము మానవులకు మార్గదర్శకులుగ నుండుటయేగదా! యోగియైనవాడు సంఘమును తృణీకరించి ఏ యడవులకో పోయి, తపస్సుచేసికొనవచ్చును. సంఘమర్యాదలను పాటింపక స్వేచ్ఛగ సంచరింపవచ్చును. కాని అవతారపురుషునకట్లు వీలులేదు. తాను సర్వదా మానవునివలె సంచరించినపుడే తన యవతరణ ప్రయోజనము నెరవేరును.

అయితే ప్రాకృతులకును వారికిని ఒక్క విషయమున భేదమున్నది. సాధారణముగా పూవు ముందు ఫలము తరువాత. ఇది ప్రకృతిలక్షణము. కాని గుమ్మడి మున్నగునవి ముందు ఫలించి తరువాత పూచునట. ఇట్లే ప్రాకృతులు ముందు సాధనముచేసి తరువాత సిద్ధులగుదురు. అవతారపురుషులు ముందు సిద్ధులయి తరువాత లోకసంగ్రహార్థము సాధనచేయుదురు. మనస్సులో నతిసూక్ష్మముగ

నణగియున్న యవరోధముల నెన్నిటినో వారుకూడ జయించి తక్కిన మానవజాతికి మార్గదర్శకులు గావలసియుందురు.

షోడశీపూజా సందర్భముననే ఒక్కమారుగ విమానముపై నెగిరి ఆమె యాధ్యాత్మిక ప్రపంచమున నెవరెష్టు శిఖరము నారోహించినట్లాయెను. కాని మరల క్రిందికి వచ్చి భూమినుండి శిఖరమువరకు గల యంతరముల నన్నిటిని ఆమె కాలినడకను పరిచయము చేసికొనవలసియుండెను. ఈ పరిచయముచేసికొనుటనే సాధనగ భావింపవచ్చును. ఆమెకు శ్రీరామకృష్ణుడు గురుదేవుడయి సాయపడెను. ఆమె యెప్పుడెప్పు డేయే సాధనము లవలంబించినదో ఏయే భూములు సాధించినదో తెలిసికొనుట చరిత్రకారులకు మహానందదాయకమే. పాఠకులకు మహోపకారమే. కాని యీ యంశములగూర్చి యామె మిక్కిలి నిగూఢముగ నుండెడిది. పరమహంస తన యాధ్యాత్మిక చరిత్రమును శిష్యుల యుపయోగార్థము కొంతగాకున్న కొంతయిన విశదీకరించుట కలదుగాని ఆమె యించుమించుగ పూర్ణమగు మౌనముద్ర వహించినదనియే చెప్పవలసి యుండును. అక్కడికిని నీళ్లలో జాడలు దీసినట్లు కొందఱప్పుడప్పు డామెను గనిపెట్టి లోకమునకు వెల్లడించిన యంశములనుబట్టి ఈ చరిత్ర నిర్మాణము కొంతవరకు సుకరమగుచున్నది. అట్టి యాంతరంగిక శిష్యమండలికి మనము సదా కృతజ్ఞులము.

తాను పదునాలుగేండ్ల వయస్సున కమార్పుకురములో శ్రీరామకృష్ణునితో వసింపవచ్చినప్పుడే ఆమె

సాధనప్రారంభమయినట్లుగ నెంచవచ్చును. తరువాత దక్షి ణేశ్వరమున నది తీవ్రగమనము వహించినది.

పూర్ణానందులను సన్న్యాసివలన నామె శాక్తేయ మున దీక్షగైకొనినట్లు గనవచ్చుచున్నది. తరువాతి కాల మున నొక శిష్యుడు పూర్ణిమనాడుదయించిన తన పుత్త్రి నికి పూర్ణచంద్రుడని పేరుపెట్టఁబోగా, "అది నా గురువు పేరు. నేనాపేరితో ఆ పిల్లవానిని పిలువజాలను." అని యామె పలికెను. అందుపయిన ఆ పిల్లవానిపేరు విద్యానాథు డని మార్చిరి.

దక్షిణేశ్వరము వచ్చినవెనుక నామె నాలుకపయి శ్రీరామకృష్ణు డొక మంత్రమును వ్రాసెను. ఇదికూడ నుపదేశమే. ఆమె వచ్చినకొలదిదినములవరకు రామకృష్ణుని సమాధిస్థితిచూచి భయపడుచుండెడిది. ఏయే బీజాక్షరములను మంత్రములను నుచ్చరించినచో నేయే సమాధులు శాంతిం చునో శ్రీరామకృష్ణు లామెకు బోధించిరి. ఇదికూడ నుప దేశముగనే పరిగణింతురు.

శ్రీరామకృష్ణునికి 'కాళి' యిష్టదైవమైనట్లే ఆమెకు 'జగద్ధాత్రి' ఇష్టదైవము. ఒకలక్ష జపము ముగియువరకు నామె యన్నమునుగాని నీరుగాని ముట్టెడిదిగాదట. వేరు వేరు దేవతలకు సంబంధించిన ప్రత్యేక సిద్ధమంత్రముల నన్ని టిని ఆమె దీక్షతో జపించిన మాటకూడ వాస్తవమే. "అమ్మా! ఇన్ని వేరువేరు మంత్రముల నుపదేశింపనేల?" అని విశ్వేశ్వరానందస్వామి ప్రశ్నించిరట. "ఈ మంత్రము

లన్నియు శ్రీరామకృష్ణు లనుగ్రహించినవే. సిద్ధమంత్రములివి. వీనిలో మంచి పటుత్వమున్నది. ఇవి జపించినచో తప్పక మేలుకలుగును.'' అని యామె చెప్పెడిదట. భిన్న వ్యక్తుల యభిరుచులకును సంస్కారములకును దగినట్లుగ నామె యుపదేశించుటకు వీలుగ భిన్నమంత్రములు శ్రీరామకృష్ణు లుపదేశించియుందురు.

సాధన సిద్ధించిన వెనుకగూడ నామె మంత్ర జపము మానలేదు. మహేశ్వరానందులిట్లు చెప్పుచున్నారు.—నేను ప్రత్యక్షముగ జూచితిని. జయరామవటిలో నెంత శరీర స్వాస్థ్యము లేకపోయినను సరే సరిగా తెల్లవారు ఝామున నాలుగు గంటలకు లేచి, సూర్యోదయమగుసరికి అవశిష్టములను దీర్చుకొని ఆమె జపమునకు గూర్చుండెడిది. ఒక బొంతగాని బ్లాంకెట్టుగాని కప్పుకొని తన శయ్యమీదనే గూర్చుండి జపము చేసెడిది. ఒక రుద్రాక్షమాల వేరొక తులసిమాల యామె కడనుండెడివి. బ్రహ్మ ముహూర్తమున, మధ్యాహ్న కాలమున, అపరాహ్ణ కాలమున, సాయంకాలము–ప్రతిదినము నాలుగు సారులు విధిగ నామె జపము చేసెడిది. దీని కపవాదము దుర్లభము. "మిక్కిలి జబ్బుగనున్నప్పుడు జపముచేయుచుండగ నరూపానందులు "అమ్మా! సిద్ధులకు సిద్ధి స్వరూపిణివి. నీకుగూడ జపమావశ్యకమా?'' అని ప్రశ్నించిరి. "అయ్యో! తండ్రీ! నేనెందరి బిడ్డల కుపదేశమిచ్చినాను! వారి యాధ్యాత్మిక బాధ్యతయంతయు నాది కాదా? వారును సరిగ సాధన

చేయుచుందురో లేదో ఎవరు చెప్పగలరు ?'' అని యామె ప్రత్యుత్తరమిచ్చినది.

ఇటీవల కాలముననే జపముపట్లను ధ్యానముపట్లను ఆమె యింత దీక్ష వహించినపుడు ప్రప్రథమమున నెంత పట్టుదలతో నుండెడిదో మనమూహించుకొనుట సుకరము. నహాబత్ ఖానాలో వరండాపయి రాత్రియంతయు జపము చేయుచు నామె గడపెడిదట. తెల్లవారుఝామున మూడు గంటలకు శ్రీరామకృష్ణులాదారిని బోవు నాచారముండెను. వారి పైజారు చప్పుడువిని యామె లోపలకు బోయెడిది. ఒకనాడదికూడ నామెకు వినబడలేదట. తలనున్న మేలి ముసుగు క్రిందికి జారిపోయెను. తదేక ధ్యానమున నామె నిమగ్నురాలయి యుండుటచే శ్రీ రామకృష్ణు లాదారిని బోయినను ఆమెకు స్పృహ రాలేదు. అప్పుడు రామ కృష్ణుని వెంటనున్న 'యోగిన్' శిష్యునివలన తరువాత నామె కీ సంగతి తెలిసినది.

దక్షిణేశ్వరమువచ్చిన తరువాత క్రొత్తలో నామెకు రామకృష్ణుని సమాధ్యవస్థచూడగ భయమువై చెడిది. రాత్రి యంతయు నిద్రలేకుండెడిది. ఈ సంగతి తెలిసి రామకృష్ణు లామెను తనగదినుండి తొలగించి నహాబత్ ఖానాలోనుండ నియమించిరి. దీనినిబట్టి యామెకు సమాధియపరిచితమని సన్నిహితవర్తులుకూడ ననుకొనుచుండిరి. అంతరంగికముగ మెలగు 'యోగిన్ మా'ను పిలచి 'నీవు పోయి ఠాకూరు (శ్రీ రామకృష్ణుల)ను నాకు సమాధి ననుగ్రహించ

వలసినదిగ ప్రార్థింపుము. మగవారి సమ్మర్ద మధికముగ నుండుటచే నా కవకాశము లేకుండనున్నది.'' అని వేడి కొనెనట. ఆమెయు నది నిజమని నమ్మి యొకనాడు సమయముచూచి శ్రీరామకృష్ణులతో దేవి ప్రార్థన నివేదించెను. వారు మాటాడక మౌనము వహించిరి. వారితో పునః ప్రసంగించుటకు భయమువైచి యామె మాతృదేవియొద్దకు వచ్చి చూచునుగదా మాతృదేవి యంతలో నవ్వుచున్నది. అంతలో నేడ్చుచున్నది. దానిని భావసమాధిగ గ్రహించి యామె తలుపుమూసి యావలికిబోయెను. మరికొంత సేపటికి తిరిగివచ్చి మామూలు స్థితికిదిగిన మాతృదేవితో ''అమ్మా! నీ వెంతటి గడుసుదానవు. నీకు సమాధి యపరిచితమంటివే.'' అని పలుకరించెనట. మాతృదేవి చిరునవ్వునవ్వుకొని యూరకుండెనట. ఎప్పుడు సాధించినదో తెలియదుగాని ఆమెకు భావసమాధి కరతలామలక మనుట నిశ్చయము.

ఒకచిన్న పల్లెము క్రిందబడినను అది యామెకు బిడుగుపాటువలె వినవచ్చెడిదట. పిల్లనగ్రోవి పాటనువిని యామె యొకసారి యదేపనిగ నవ్వనారంభించినదట! వీనిని గూడ భావసమాధి లక్షణములుగనే భావింతురు.

రామకృష్ణుల నిర్యాణానంతరము ఒకానొక దినము కలకత్తాకు సమీపమున నున్న బేలూరులో నీలాంబర ముఖర్జీ సౌధమున పై యంతరువు డాబాపయి యోగిన్ మా గోలప్‌మా, మాతృదేవి యీ ముప్వురును గలసి ధ్యానమునకు

గూర్చుండిరి. తన ధ్యానమును ముగించుకొని యోగీశ్వరా కనులు తెరచి చూచుసరికి మాతృదేవి కదలిక లేక శిలావిగ్రహమువలె గూర్చుండెను. చాలా సేపటికిగాని ఆమెకు దేహ స్పృహ కలుగలేదు. దేహ స్పృహ వచ్చిన వెనుక "యోగిన్! నా కాళ్లేవి? నా చేతులేవి? యని యామె ప్రశ్నింప నారంభించినది.

నిర్వికల్ప సమాధినుండి దిగి వచ్చిన వెనుక వివేకానందుడుకూడ ఇట్లే ప్రశ్నించుటచే నిది నిర్వికల్ప సమాధి యని ప్రాజ్ఞులు నిశ్చయించుచున్నారు.

తరువాత గూడ మాతృదేవి అత్యుత్తమములయిన యనుభూతులను పొందుచు వచ్చినది. కాని యామె గంభీర స్వభావురాలగుటచే వీని నితరులకు గానరానిచ్చెడిదిగాదు. నిత్యసిద్ధుడనియు ఈశ్వరకోటిలో నొక్కడనియు శ్రీరామకృష్ణుడు నిర్ణయించిన ప్రేమానందస్వామి యామె యాధ్యాత్మికోన్నతిని గూర్చి యిట్లు పలుకుచున్నాడు.—"ఆమె సర్వశక్తి నిలయ. శ్రీరామకృష్ణుడు ప్రయత్నించియు దన యనుభూతులను దాచుకొనలేక పోయెడివాడు. ఆతని విషయమున బాహ్యమునగూడ మార్పులు గానవచ్చెడివి. ఆమె యట్లుగాక తన యనుభూతులనన్నిటిని దిగమ్రింగివై చెడిది." అయినను కొందరు మహాదృష్టవంతుల కామె యుత్తమస్థితులు దర్శించు భాగ్యము పట్టెడిది. తపానంద స్వామి యిట్లు వ్రాయుచున్నారు.—"ఒకనాడు జయరామవటిలో కాళ్లు ముందుకు చాపుకొని మాతృదేవి

కూర్చున్నది. (తరచు అట్లు కూర్చుండుట యామె కలవాటు) కన్నులు తెరచియేయుండెను కాని ఆమె మనస్సు దేశకాలముల కతీతమైయుండెను. కన్ను రెప్ప వేయక యీ యద్భుతస్థితిని జూచుచుంటిని. కొంతసేపటికి దేహస్పృహ కలిగి ఏదో పొరపాటు జరిగినట్లుగ నొచ్చుకొని యామె తటాలున లోపలికిబోయినది.'' శ్రీయుత సింహానాథ పండా యిట్లు పలుకుచున్నారు.—''దుర్గాదేవికి ఉద్వాసన చెప్పుదినమున గురుమహారాజుకు (శ్రీరామకృష్ణునకు) నైవేద్యము పెట్టవలసినదిగ ఆమె నన్నాజ్ఞాపించినది. నేను బట్ట మార్చుకొనివచ్చునంతలో నామె సోదరుని యింటిగడపవద్ద మాతృదేవి యాసీనురాలయియున్నది. పూజాగృహములోనికిబోయి గురుమహారాజుకు భోగముజరిపి పవళింపు సేవ చేయుమని యాజ్ఞయిచ్చినది. అవన్నియు జరిపి నేను తిరిగి వచ్చుసరికి చిత్తరువులోని బొమ్మవలె వెనుక నేను చూచిన ప్రకారమే ఆమె కూర్చుండిపోయియున్నది. నేను నమస్కరించినను ఆమెకు దెలియుటలేదు. ఇంకొక మార్గము తోచక ఆమెకడ కొంతసేపు కూర్చుంటిని.''

శ్రీరామకృష్ణునివలెనే సవిశేషనిర్విశేషముల నామె చక్కగ సమన్వయింపగలిగెడిది. నరేంద్రుడామెతో మాటాడుచు నొకనాడు ''అమ్మా! జగత్తంతయు శూన్యములో లీనమయిపోవునట్లు నాకు స్పష్టముగ గోచరించుచున్నది.'' అనెనట. ''నాయనా! నన్నుమాత్రము పరిత్యజింపకుమా'' అని యామె నవ్వుచు పలుకగ నరేంద్రుడు,

" తల్లీ ! నిన్ను పరిత్యజించిన-చో నాకు నిలువనీడయుండునా ? గురుపాదములను మిథ్యయని నిరాకరించు జ్ఞానము అజ్ఞానమనిపించుకొనును. గాని విజ్ఞానమనిపించుకొనదు. పూర్ణ జ్ఞానియగువాడు ఈశ్వరునిగూడ మిథ్యగ నిరాకరింపవచ్చును. కాని గురుపాదపద్మములు మాత్రము మాయయని నిరసింప లేడు. బ్రహ్మజ్ఞానముగలిగిన తరువాత నాబ్రహ్మమే జగత్తంతయు నిండియున్నట్లు స్పష్టమగును. ఇదివరకు ' నేతి ' ' నేతి ' వాక్యములచే నిరాకరించిన జగత్తునే చిన్మయముగ నిప్పు డంగీకరింపవలసియుండును. బ్రహ్మానుభవమున కంతకును సారమింతే " అని హుంకరించెనట. ఈయుదంతము నామె తరచు సవిశేషనిర్విశేష సమన్వయమును స్థాపించుటకు పేర్కొనెడిది. ఇట్లే సాధనను భగవత్కృపతో నామె సమన్వయించుచుండెడిది. విశ్వేశ్వరానంద స్వామి యిట్లు చెప్పుచున్నారు. " ఒకనాడామె నాకెంతో బోధించినది. ఆ బోధనమంతయును జ్ఞప్తియందులేదుగాని ఒక్కయంశము మాత్రము మరచిపోలేను. మంచి గంధము చెక్క నరగదీసినట్లుగ సాధనచేసినపుడే భక్తుడు పరిమళించును ' అన్నది.

"ఆమె యిక మూడు సంవత్సరములకు నిష్క్రమించును నగ నామె పుట్టినదినమున నొకనాడు జయరామవటి పోయితిని. ఉత్సవమైన వెనుక నామెకు జ్వరమువచ్చినది. జ్వరము నిమ్మళించినది కాని యింకను నీరసము వదలక వసారాలో గూర్చుండియుండగ ఆమెను సమీపించి,

'అమ్మా! ఈశ్వరసాక్షాత్కృతికి ముఖ్యసాధనమేమి?' అని ప్రశ్నించితిని. జపమో ధ్యానమో సాధనమని చెప్పునను కొంటిని. అట్లుగాక ఆమె 'భగవత్కృప' అన్నది. ముమ్మారు మరలమరల నదే ప్రశ్నవైచితిని. ముమ్మారును అదే సమాధానము చెప్పి 'ఇంకొక గతిలేదు' అన్నది. ఆమెను నేను ప్రశ్నించుట కదియే కడపటిసారి."

అవతారమూర్తి గనుక ఉన్నతస్థితు లామెకే సాధ్యములనియు మన కసాధ్యములనియు ననుకొన్నచో నామె జీవితమును చదివి ప్రయోజనము లేదు. ఆమె గొప్పను ప్రకటింపవలెనని ఎంత మహోన్నతముగ నెత్తివైచినను శివుడు మొదలుకొని చీమవరకు సర్వపదార్థములయందును నామెయున్నదనియు సమస్తజీవులకు నామెమార్గదర్శకురా లనియు మరువరాదు.

"చందమామ అందరకును మామయే. భగవంతు డొక్కరి కాణాచిగాడు. హృదయపూర్వకముగ నెవరు పిలిచినవారికే పలుకును." అని శ్రీరామకృష్ణు లామె కుప దేశించువారు. "చంద్రునిలోగూడ కళంకమున్నదిగాని సచ్చిదానందమూర్తీ! నా జీవితమున కళంకలేశమైన జొర నీయకుము." అనునది యీ తరుణమున నామెచేసిన ప్రార్థన లలో నొక్కటియట. "సాధనమూలమున కొమ్ములు మొలుచుననుకొంటిరా? హృదయము పరిశుద్ధమయి ఈశ్వర సాక్షాత్కారమున కధికారము సంపాదించుకొనును. అంతే" అని ఆమె యుద్ఘోషించుచుండెడిది.

ఇట్టి మహావ్యక్తులు తాము తరించు నిమిత్తమయి తపస్సు చేయరు. జీవుల దుఃఖములు వారికి దుస్సహములు. లక్షలాదిగ ప్రజల నుద్ధరింప జేయుటయే వారి యభీష్టము. అందు కొరకయి యహోరాత్రములు హారతి కర్పూరమువలె హరించి పోవుచుందురు. వారు అడుగు మోపిన ప్రదేశము వారణాసి. శ్రీ రామకృష్ణుని యనంతరము లోక కల్యాణమున కయి పాటు పడు నిమిత్తము శ్రీరామకృష్ణుడు జీవించి యున్నంత కాలము సాధన చేసి యామె సంసిద్ధురాలగు చుండెను.

"జగద్గురువు సూర్యుని వంటివాడు. ప్రాకృత గురువు చంద్రుని వంటివాడు. సూర్య తేజమే చంద్రునిలో ప్రతిబింబించునట్లు ప్రాకృత గురువులలో జగద్గురుని యంశమే ప్రతిబింబించుచుండును" అని శారదానందులు వచించువారు.

## 10. గురుశుశ్రూష

గురువనగా నెవరు? అతని నెందులకు సేవింపవలెను?

ఏవో బీజాక్షరములతో సంపుటి చేసిన భగవన్నామము నొక దానిని మన నెత్తిని గొట్టి బ్రదికి యున్నన్నాళ్లు మనలను తన బానిసలుగా చేసికొని వేధించుకొని తినువాడు గురువని కొందఱి యపోహ. ఎంత సేపును దక్షిణ కొరకు బీకుకొని తినుటయే అతని వృత్తి యని కూడ తోచుచుండును. ఎవ్వరో కొందఱు లోకవంచకులను జూచి జాతినంతను ఈ విధముగ నపార్థము జేసికొనుట న్యాయము గాదు.

వ్యక్తులకు తాము వ్యక్తులము మాత్రమే యను పృథగ్భావమును పోగొట్టి విశ్వత్వమును ప్రసాదించువాడు గురువు. పెండ్లి కుమార్తెచే సప్తపాదములు త్రొక్కించు పెండ్లి కుమారుని వలె జీవిని సప్తభువనములను దాటించి అనంతమయి విశ్వమంతయు నిండి విశ్వాతీతమయి వెలుగు తేజములో లీనము చేయువాడు గురువు. కొందఱు ఈ తేజములో తాము విభిన్నాంశము లను భూమి సాగి పోవచ్చును. మరికొందఱు ఈ తేజమును తామును ఒక్కటే యను పూర్ణజ్ఞానమును బడయవచ్చును. మొత్తము మీద నిరు తరగతులకు తారతమ్యము మిక్కిలి తక్కువ. ఒక వ్యక్తిని గైకొని యాతనికి విశ్వత్వమును ప్రసాదించు టనిన మాటలచే జరుగునది కాదు. తాను విశ్వత్వమును పొందినవాడే గాని ఇంకొకరికి విశ్వత్వమును ప్రసాదింప జాలడు. అనగా సిద్ధ పురుషుడైన వాడేగాని నిజమయిన గురువు కాజాలడు. అట్టి సిద్ధగురువులనే సద్గురువులని కూడ వ్యవహరింతురు. అట్టివారు అకారణ దయాసింధువులు. శిష్యునికడ నుండి పోకచెక్కగూడ వా రాశింపరు. తమ సర్వస్వమును శిష్యుని నిమిత్తమయి ధారపోయుదురు. అట్టి గురువే లభించిననాడు అతనికి మన సర్వస్వమును ధారపోసి జన్మమునంతను బలి పెట్టినను అతని ఋణము మనము తీర్చుకొనలేము.

ఇక్కడ మన శారదాంబకు లభించిన వాడు కేవలము సిద్ధ గురువు మాత్రమే కాదు. సిద్ధాతి సిద్ధ గురువు. ఆమె

కఠోర తపస్సులో జపము కంటెను ధ్యానము కంటెను గురు శుశ్రూషయే ముఖ్యమైనది. ఎందు చేత?

తీవ్రమయిన సాధన చేసి ఆమె కనుగొన్నది ఒక్కటే సత్యము. తన యెదుట తన భర్త రూపమును ధరించి తన యజ్ఞానమును రూపు మాపి వెలుగుచున్న వెలుగే విశ్వమంతయు నిండి యున్నదని ఆమె యనుభవ పూర్వకముగ దెలిసికొనెను. శ్రీ రామకృష్ణు డనగ నామెకు కొన్ని యక్షరముల కలయిక మాత్రమే గాదు. ఒక దేహము నందు వసించు జీవిమాత్రమేకూడ గాదు. పృథివి యందున్న దేవత లందఱును నాతనిలో మూర్తీభవించినారు; అతనిని మించి పరమ సత్యము వేరే లేదు అని యామె నిశ్చయము. తన శిష్యుల కందరకును నామె యీ తీరున బోధించెడిది. "గురువు ఇష్టదైవము అన్నియు నాకు ఠాకూరే. (శ్రీరామకృష్ణుడే) అతడే ప్రకృతి. అతడే పరుడు." శ్రీరామకృష్ణుని పూజించు విధాన మేమని సౌరేంద్రనాథుడను శిష్యు డడగినవుడు, "బిడ్డా! శ్రీ రామకృష్ణుడు సర్వ దేవ దేవీ స్వరూపుడు. సర్వమంత్రములకు ఆయనయే గమ్యుడు. నీవు భక్తితో వారి పాదములకు పుష్పములు సమర్పించుటే వారి పూజా విధానము." కైలాస కామినీ రాయి అను శిష్యునితో నామె యిట్లు పలికెను. "శీతల, మానీస (మన పోలేరమ్మ నూకాలమ్మ వంటివారు) మున్నగు దేవతలు కూడ రామకృష్ణునిలో నిమిడియున్నారు. క్షుద్ర దేవతలు మొదలుకొని పరాత్పరుని వరకు నంతయు నాతడే." రామ

కృష్ణుని నిర్యాణమున "తల్లీ! కాళీ! ఎందు బోయితివి?" అని యామె విలపించినదట. దీనిని బట్టి రామకృష్ణుని యెడ నామె యాంతరంగిక మనోభావము వ్యక్తమగుచున్నది.

అంతగ ప్రేమించు నిష్టదైవము భర్తరూపమున తన యెదుట ప్రత్యక్ష మయినపుడు ఆతని యెడ నెట్టి భక్తి ప్రపత్తులను గానబరచుచుండెడిదో తెలిసికొనుట యానంద దాయకము గాదా? ఆమె శుశ్రూషను మూడు భాగములుగ విభజించి చూడవలసియున్నది. (1) గురువుకు గురువైన గురుమాతకు చేసిన సేవ (2) గురువుకు చేసిన సేవ (3) గురువుకు వాత్సల్య పాత్రులయిన యితర శిష్యులకు చేసిన సేవ.

రామకృష్ణుని తల్లి చాలకాలము జీవించియుండెను. చివరరోజులలో నామె మతి స్థిరముగకూడ లేకుండెను. రామకృష్ణుని యన్న లిద్దరు నామె కనులముందే చనిపోయిరి. పెద్దకోడలును అక్షయుడను మనుమడును ఆమెకుముందే చనిపోయిరి. ఇట్లిహజీవితమున నెన్నో దెబ్బలుతిన్న యా సాధ్వికి శారదామణి తానును తన భర్తయు చేయవలసిన సేవ తానొక్కతెయే చేసెడిది. అత్తగారి నామె సేవించు చుండగ యోగిన్‌మా చూచినది. ఆమెను బిలువగోరి యత్తగారు 'శా' యను నక్షరము నుచ్చరించునరికి చెంగున బోయి శారదాదేవి యామెకడ నిలిచెడిదట. అంత తొందరగబోయినచో గుమ్మముతగిలి గాయముపడవచ్చునని యోగిన్‌మా జగడమాడినను వినిపించుకొనెడిదిగాదట.

"అత్తగారనగా నా గురువుగారికి గురుస్థానము. ఆమె నన్ను తల్లివలె ప్రేమించుచున్నది. శతవృద్ధు! పిలువగనే పోకున్నచో నామెకే యిబ్బంది కలుగునో! దెబ్బతగిలిన తగులనిమ్ము!" అని యామె సమాధానము చెప్పెడిదట.

నహబత్ ఖానాలో గదా శారదాదేవియు నామె యత్తగారును వసించుచుండిరి. ఈ నహబత్ ఖానాను ప్రకృత రచయిత పలుసారులు దర్శించెను. ఒక్కమనిషికూడ కాళ్లు చాపుకొని పండుకొనుటకు వీలుగ నది కనబడలేదు. అంత సంకుచితముగనున్నది. గుమ్మము మిక్కిలి చిన్నది. తొందరగబోయినచో తలకు మొట్టికాయతప్పదు. అంత చిన్నప్రదేశమున నిద్దఱువ్యక్తు లెట్లు కాలక్షేపము చేసిరో తెలియదు. ఈ యిద్దరితో సరిపోయినదా? గురుదేవుని దర్శింపవచ్చిన స్త్రీవ్యక్తులలో గొందఱచ్చటనే యతిథులుగ నిలుచుట తటస్థించుచుండును. వంటపాత్రలు, కూరగాయలు, పప్పు, ఉప్పు, నెయ్యి మున్నగు సామానులు–ఇవన్నియు నందే యిముడవలసియున్నది. దానికితోడు బంగాళాదేశమున ఘోషాపద్ధతియుండుటచే హృదయరాముని ధర్మమా యని వసారాచుట్టు వెదురుతడికెలు. ఈ తడికెలకు కన్నములు పెట్టి ఆమె శ్రీరామకృష్ణుని గదివంక చూచుచు నచ్చటి ప్రసంగములను వినుచు సంకీర్తనలను నృత్యములను గ్రోలుచు కాలక్షేపముచేసెడిదట. "నానాటికి కన్నములు పెద్దవగుచున్నవి." అని నవ్వుచు రామకృష్ణుడు వేళాకోళముచేసెడివాడట.

శ్రీరామకృష్ణునికి తఱచు దేహస్పృహాయుండెడిది కాదు. తీవ్రమయిన యాధ్యాత్మిక సాధనలవలన అతని జీర్ణకోశ మంతయు పాడైపోయెను. ఎంతో సున్నితమయిన యాతని తత్త్వమునకు ఇతరు లెవ్వరు వండిపెట్టినను సరిపడెడిది గాదు. అతనికి హితవుగ నెట్లు వంటచేసిపెట్టవలెనో ఆమెకు దెలిసినట్లు మరియొకరికి తెలియదు. చంటిబిడ్డను లాలించి నట్లుగ బుజ్జగించి భోజనము తినిపించవలసియుండెను. భోజన మగులోపల నేదయిన భక్త్యుద్దీపనము కలిగినచో సమాధి కలిగెడిది. ఇక నాపూటకు భోజనముండెడిది కాదు. అందుచే సమాధికలుగకుండ జాగ్రత్తపడుచు ఏవో మామూలు ప్రసంగ ములలోనికి దింపి యాతని కన్నము పెట్టవలసియుండెను. "ఎన్ని పాలు కాచినావు?" అని యడిగినపుడు నిజము చెప్పెడిది కాదు. చెప్పినచో "అన్ని పాలు త్రాగినచో నా కజీర్ణము చేయదా?" యని యాయన భయపడును. అన్నము కూడ గుజ్జుగ కలిపి తక్కువగ కనబడునట్లు చేసెడిది. ఇన్ని విధముల శ్రమపడి సేవింపగ నాతని యారోగ్యము కొంత కుదుటబడెను. "చూడు! నీవు పెట్టిన భోజనము తిని నే నెంత బలిసిపోవుచున్నానో" అని యాయన హాస్యమాడు వాడు.

అతనిని దర్శింపవచ్చు నాంతరంగిక శిష్యులలో కొంద ఱచ్చటనే యొకటి రెండు పూటలుండిపోవువారు. వీరందఱి కిని నామెయే స్వయముగ నెవరి కేదియిష్టమో అది వంట చేసిపెట్టెడిది. నరేంద్రునికి చపాతీలు బంగాళాదుంపల

కూర, రఖలుకు కచూరీ (పులగము) ఈ తీరుగ నందఱ కన్ని విధముల నా యన్నపూర్ణ వండి వడ్డించెడిది. ఎన్నడును విసుగుకొని ఎఱుగదు సరిగదా ఇంతటి యవకాశము లభించి నందులకు సర్వదాహృదయమున హర్షము పొంగిపొరలు చుండెను.

"సోమరుల మనస్సు నిరుపయుక్తములగు వ్యాసంగములకు దిగును. అందుచే నొక్క నిముసమయిన సోమరితనము పనికిరాదు." అని గురుదేవుల యుపదేశము. ఈ యుపదేశము నామె ఎన్నడును మరచిపోలేదు. తెల్లవారు ఝామున నాలుగు గంటలకు పూర్వమే మేల్కని రాత్రి పదునొకండు గంటలప్రాంతమున మంచమున మేనువ్రాల్చువరకు జపము ధ్యానము మున్నగు సాధనప్రణాళికలోనే గాక వంటవండుట వడ్డించుట లాంతరులో చమురుపోయుట వత్తులు కత్తిరించుట, ఉట్టెలు తయారుచేయుట మున్నగు లౌకికకృత్యములలోగూడ నామె నిమగ్నయైయుండెడిది.

ఎన్నిపనులుచేయుచున్నను మనస్సుమాత్రము గురుదేవుని సన్నిధినేయుండెడిది. ఈ వ్యాసంగమున నామె చూపు నేకాగ్రత మిగుల నాశ్చర్యకరమైనది. శారదా ప్రసన్నుడను శిష్యుడు రామకృష్ణునియొద్దకు రహస్యముగ వచ్చిపోవుచుండువాడు. అందుచే బండియద్దె నాతడింటియొద్ద నుండి తెచ్చుకొనక రామకృష్ణుడే యిచ్చుచుండువాడు. ఒకనాడు బండియద్దె కొకయణా తక్కువపడినది. శారదాదేవి నడిగి తెమ్మని గురుదేవు డాజ్ఞయిచ్చెను. ఆ శిష్యుడు

వచ్చుసరికి గడపమీద సణాసిద్ధముగనుండెను. దివ్యజ్ఞానముపయోగించి యామె యాయనణా నక్కడనుంచలేదు. గురుదేవుని చరణసన్నిధినే ఆమె మనస్సు ఏకాగ్రతతో వర్తించుచుండుటచే నక్కడ చీమచిటుక్కుమన్నను ఈమెకు తెలిసెడిది.

క్రమక్రమముగ నీ సేవలో కొంత శ్రమను ఇతరులు పంచుకొనుచుండిరి. 'లాటూ' అను కుఱ్ఱవాడు రామకృష్ణుని శిష్యులలో నొక్కడు. రామచంద్రదత్తు నింటిలో నీతడు నౌకరు. రామచంద్రుడు అతనిని నౌకరీ నుండి తప్పించి రామకృష్ణుని సేవ కొప్పగించెను. ఒక్క నాడీ లాటూ పంచవటిలో ధ్యానము చేయుచు గూర్చుండగ జూచి రామకృష్ణుడు "ఇక్కడేమి తంటాలు పడెదవు? నీ యిష్టదేవత అదిగో! ఆ నహాబత్ ఖానాలో రొట్టెలు చేయుచున్నది. పోయి యామెకు పిండి మర్దించి పెట్టుము. అని పంపెను. అప్పటి నుండియు గోధుమ పిండి మర్దించుటలో 'లాటూ' ఆమెకు సాయము చేయుచుండెను. రామకృష్ణుని శిష్యులతో నయినను శారదాదేవి ముఖమునకు ముసుగు వైచుకొనియే మాట్లాడెడిది. ఒక్క లాటూతోను 'గోపాల్ దా' యను వయస్సు చెల్లిన మరియొకరితోను మాత్రమే ఆచ్ఛాదనము లేకుండ మాట్లాడెడిది.

రామకృష్ణుని సేవించుటనిన నామె కపారమయిన యుత్సాహమున్నను దానినంతను తానే చూరగొనవలెనన్న స్వార్థచింత యామెకు లేకుండెను. అందుచే గ్రమముగ

నామెకు రామకృష్ణుని దర్శనభాగ్యమే దుర్లభమగుచుండెను. అన్నము పట్టుకొని వెళ్లి తినిపించినపుడే యామె కవకాశముగ నుండెను. ఈ యవకాశమును గూడ ఎవ్వరో యొక్కరు లాగుకొనువారు. యోగిన్మా చెప్పినట్లుగ సతీపతు లిరు వురును పది బారల దూరమున నివసించుచున్నను ఒక్కొ క్కప్పుడు రెండు మూడు నెలలకొక సారియైన గలసికొనుట దుష్కర మగుచుండెను. "అంతటి లోకోత్తర పురుషుని ప్రతిదినము గలిసికొను భాగ్యము కూడనా?" అని తనలో తాను సరిపెట్టుకొనియెడిది. ఎవ్వరయిన నాతని సేవకయి ముందంజ వేసి వచ్చినచో సంతోష పూర్వకముగ వారి కవ కాశ మిచ్చెడిది. అందఱును వారిని సేవించి తరింప వలసిన వారే గారా?

రాక రాక అన్నము పట్టుకొని వెళ్లు నవకాశ మొక్కప్పు డామెకు లభించెను. గదిగుమ్మము దగ్గరకు పోవుసరికి ఎవ్వరో స్త్రీ వచ్చి యామె చేతినుండి భోజన పాత్రను లాగుకొని గురుదేవునియొద్ద నుంచి వెడలిపోయెను. అనంతరము మాతృదేవిని సమీపింపగ "ఆ స్త్రీ చరిత్రము నీకు దెలియును గాదా? మగనిని వదలి పెట్టి మరదితో కాపురము చేయుచున్నది. ఆమె చేతి యన్నమును నేను ముట్టను" అని రామకృష్ణుడు పట్టు పట్టెను. ఎట్టకేలకు మాతృ దేవి బ్రతిమాలగా "ఇంక నెన్నడు నట్టివారికి భోజన పాత్ర మీయ నని వాగ్దానము చేసినచో నన్నము తిందు" నని యాతడు దిగివచ్చెను. అప్పు డామె చేతులు జోడించుకొని

ప్రభూ! అట్టి వాగ్దానము చేయుటకు నాతరము గాదు. ఎవ్వ రయిన తమ సేవకయి ముందంజ వేసిన కాదన గల్గునంతటి కఠిన చిత్తత ఎన్నడును నా కబ్బకుండును గాక! సాధ్యమై నంతవరకు నేనే పట్టుకొని వచ్చెదనని మాత్రము వాగ్దానము చేయగలను.'' అని విన్నవించుకొన్నది. ఆమె యుదార చిత్తతకు మెచ్చుకొని పక పక నవ్వుచు గురుదేవుడు భోజన మారగించెను.

## 11. సల్లాపరసము—స్వాతంత్ర్యము

శారదా దేవియును రామకృష్ణుడును ఆధ్యాత్మికముగ నత్యుత్తమ స్థితిని బ్రాపించి రని తెలిసికొంటిమి. శిష్యా భావముతో (శ్రీ) రామకృష్ణు నామె సేవించెననికూడ తెలిసి కొంటిమి. దీనిని బట్టి వారి యన్యోన్యతలో పరిహాసమునకు తావు లేదని గాని ఆమె యెన్నడును స్వబుద్ధి నుపయోగించి ఏ పనియు చేసెడిది కాదని గాని యూహింప రాదు. ఆమె పాతివ్రత్యము గతానుగతికమైనది కాదు. అందు స్వతంత్ర మయిన వికాసమున్నది. ఆమె శీలము నర్థము చేసికొనుటలో నీ రహస్యము నెన్నడును మరువరాదు. వారి దాంపత్యము సజీవమైన స్వతంత్ర తేజముతో వెలుగుచుండెడిది గాని గతానుగతికత్వమను రైలుపట్టాల మీద నడచినది కాదు. రామకృష్ణుడు పరిహాస ప్రియుడు. మహేంద్రనాథ గుప్తులు వ్రాసిన కథామృతము చదివినచో హాస్యరసము వారి సొమ్మని విదిత మగును. అంతటి హాస్య ప్రియుడు శారదా

దేవి యెడగూడ దానిని బ్రయోగింపకుండునా? మధుర హాస్యముతో నిండిన యుదంతము లెన్నో వారి నిత్య జీవిత మునకు నూతనోల్లాసము గూర్చుచుండెను. ఇట్టి యుదంత ములు కొన్నిటిని ఆమె చరిత్రకారులు పేర్కొన్నారు. కొంత కొంతవరకే హాస్యము స్థానికమే యగుటచే సర్వజనాను భోగ్యము గాకుండ నున్నది. ఒకనాడు కమార్పుకురమున హృదయుడును, రామకృష్ణుడును నామె చేతి భోజన మార గించుచుండగ ఆమె వంటను వేరొక యువతి వంటతో బోల్చుచు రామకృష్ణులు "ఆ యువతి వంట రామదాసు వైద్యము వంటిది. నీ వంట శ్రీనాథసేను వైద్యము వంటిది." అనెనట. ఇక్కడ రామదాసుని గూర్చి శ్రీనాథ సేనుని గూర్చి తెలిసిన వారికి గాని ఆ హాస్యరసమును భోగ్యము కాదు. రామదాసు ఘన వైద్యుడట. శ్రీనాథ సేను సామాన్య వైద్యుడట.

సర్వజనానుభోగ్యములైన యుదంతములుకూడ కొన్ని లభ్యమగుచున్నవి. ఒకనాడొక యమాయకురాలు తన దగ్గఱ చుట్టమొకడు దుష్ప్రవర్తనపాలై పోవుటచూచి పరమ హంస యేదయిన మంత్రించియిచ్చినచో వర్తనము తిన్న బడునని యాలోచించి ఆతనిని సమీపించి వచ్చినపనిని చెప్పెను. ఆమె యమాయకత్వమునకు నవ్వుకొని పరమ హంస నహబత్ ఖానావైపుజూపి "అదిగో! అక్కడ నొక మహాత్మురాలున్నది. ఆమె యేదయినను మంత్రించియిచ్చి నచో మీ బంధువు ప్రవర్తనము తిన్నబడు"నని మాత్ర

దేవియొద్దకు బంపెను. ఆ యమాయకురాలు చెప్పిన యుదంతమును విని పరమహంస పరిహాసప్రియత్వము గనిపెట్టి, "అయ్యో! నా మొగము నాకేమి తెలియును. ఆయన యొద్దకేపోయి మరల నడుగుము—అన్నియు వారికే తెలియును" అని మాతృదేవి యామెను తిరుగబంపించెనట. సీతారాముల మధ్య శూర్పణఖ తిరిగినట్లుగ ఆ యమాయక హృదయ ఈ సతీపతుల నడుమ నాలుగైదుసారులు తిరిగిన వెనుక మాతృదేవికి జాలివైచి యొక బిల్వదళమును మంత్రించి యిచ్చెనట.

తరువాత కొంత చాయతగ్గినను ఆ దినములలో పరమహంస దేహము ధగధగ మెరసిపోవుచుండెడిదట. దేహచ్ఛాయనుగూర్చి వారికిని మరియొకరికిని పోటీవచ్చినది. తీర్పరిగ మాతృదేవిని వారెన్నుకొనిరి. పందెముగాసిన యిరువురు నహబత్ ఖానా యెదుట నడువగజూచి యామె తీర్పు చెప్పవలసియుండెను. నిష్పక్షపాతబుద్ధితో నామె యారెండవవ్యక్తియే మెరుగని తీర్పుచెప్పెనట.

కమార్పుకురముననుండగ మాతృదేవియు మరియొక స్త్రీవ్యక్తియు వీధినాటకము నొకదానిని చూడగోరిరి. పరమహంస వారిని కబుర్లలోనికి దింపి తాను చిన్నప్పుడు విన్న వీధినాటకము నొకదానిని సంభాషణలు పద్యములు దరువులతోసహా 'తుచ'లు తప్పకుండ వినిపించి అభినయించి చూపెనట. ఆ వినోదమున కానందించుచు ప్రకృత నాటకప్రసక్తిని వారు మరచిపోయిరట.

పై కెంత పరిహాసప్రియుడుగ గనవచ్చినను లోపల నామెయెడ నాతని కఖండమైన గౌరవము. ఆమె యేదయిన స్వతంత్రించి నిర్ణయించినదా ఆ నిర్ణయము నాతడుకూడ ఎంతో భక్తితో గౌరవించువాడు.

ప్రవర్తన చెడిపోయిన ఒకస్త్రీ యామెకడకు తరచు వచ్చెడిది. అట్లు వచ్చుట అతని కిష్టముండెడిది కాదు. నిప్పు వంటి యామె శీలమునకు చెదలంటవని యాతనికి దెలియును. గాని లోకసంగ్రహార్థ మాస్త్రీని రానీయగూడదని యామెతో జెప్పెను. అగాధకరుణాస్వరూపురాలగుటచే మాతృదేవి మగడుచేసిన కట్టడిని పాటింపలేదు. అది తెలిసియు "నామె యిష్టమామెది" అని యాతడు తిరుగ నా ప్రసంగ మెత్తలేదు.

శిష్యుల యాధ్యాత్మికాభివృద్ధి నాశించి వారు మితముగ భుజింపవలెనని యాతని శాసనము. ప్రత్యేకసాధనలలో శిక్షనీయవలెనని యాతడు వారిని తరచు దక్షిణేశ్వరమున నాగి పొమ్మనువాడు. అప్పుడు మాతృదేవి ఎవరి కెన్నెన్ని చపాతీ లీయవలెనో ఎంత కూర వేయవలెనోకూడ ఆతడు నిశ్చయించువాడు. కాని ఆమెది మాతృహృదయ మగుటచే నానీమము నుల్లంఘించెడిది. ఒక నాడదిచూచి "ఇదేమి?" వీరి కాహార మెక్కువపెట్టి పాడుచేయుచున్నావే" అని ఆతడు జగడమాడెను. ఆమెకు కోపము వచ్చి, "వారి యాధ్యాత్మికాభివృద్ధినిగూర్చి నేను చూచుకొందును లెండు" అన్నది. ఆమెకు గోపమువచ్చినదని

గ్రహించి పరమహంస మెల్లగ నింకొక ప్రసక్తి తెచ్చి యాయంశమును మరియెత్తలేదు.

ఆమెయెడ నాతని కెంతటి గౌరవభావమో ఈ క్రిందియుదంతము ఋజువుచేయును. తలుపుదగ్గరనున్నది తన యన్నకూతురనుకొని చిన్నలకువాడు 'తుయ్' అను పదము నాతడు వాడెను. 'నీవు' 'మీరు' 'తమరు' అను పదములలోని తారతమ్యమును నిరూపించుటకు సమానార్థకములు బంగాళీలోనున్నవి. ఇందు 'తుయ్' అనునది 'నీవు' అనుటకు సరియైనది. కొంచెము నిదానించిచూచి అక్కడ నున్నది తన యన్నకూతురగు లక్ష్మీదీదిగాక దేవియని గ్రహించి ఆమెకడకువచ్చి నిమ్నార్థకము వాడినందులకు క్షమాపణవేడికొనెను. ఆ రాత్రియంతయు నాతనికి నిద్ర పట్టలేదు. మరునాడుదయమున నామెను మరల క్షమాపణ వేడుకొనువరకు నాతనికి మనశ్శాంతిలేదు.

భార్యాభర్తల నడుమ సర్వసాధారణముగ మర్యాద తప్పకుండుట చూడవచ్చునుగాని ఎప్పుడును ఏమాత్రమును తొందరపడకుండుట దుర్ఘటము. మనదేశమున నిటీవల స్త్రీని హీనముగజూచుట యొక యాచారమైన దనుకొనుడు. పాశ్చాత్యదేశములలోగూడ తరచు మర్యాదతో వర్తించు వారుకూడ ఒకొక్కప్పుడు మిక్కిలి నీచముగ తూలనాడుటగలదు. పరమహంస యెన్నడును తన భార్యతో గౌరవము తగ్గించియైన సంభాషించినట్లు కనబడదు. ఇది యసిధారావ్రతమే.

1881 లో శారదాదేవియు శ్యామసుందరీదేవియు దక్షిణేశ్వరమువచ్చినపుడు మాత్రము హృదయుడు వారిని తృణీకరించి "ఏమంత మునిగిపోయినది? ఎందుకు వచ్చినారు?" అని బిగ్గరగ కేకలువేసి సాగనంపెను. అది చూచి పరమహంస హృదయునికి భయపడియో మరే కారణముచేతనో యూరకున్నాడుగాని అతనిని మందలించి వారికి స్వాగతమీయవలసినది—ఈయలేదు. ఈయొక్క సందర్భముమాత్రము అర్థముచేసికొనుట సుకరముగాకున్నది. పాపము! చేయునదిలేక ఆ సతీమతల్లు లిరువురును వచ్చిన దారినే తిరిగిపోవలసినవారైరి. "తల్లీ! నీ యనుగ్రహమున్నచో మరల నిక్కడ నడుగుపెట్టుట కవకాశముండును." అని లోలోన కాళికకు శారదాదేవి మ్రొక్కుకొని నిష్క్రమించెను. ఈ యవినీతికి ప్రతిఫలమో యనినట్లు త్వరలో హృదయుడు పదభ్రష్టుడయి మరల దక్షిణేశ్వరాలయమున నడుగుపెట్టుట కవకాశములేకుండ బోయెను.

పరమహంసకు శారదాదేవి యెడనున్న గౌరవ ప్రపత్తులకు ఉత్తమ నిదర్శనముగ శారదా ప్రసన్నుడను శిష్యుని ఆమెయొద్ద కుపదేశము నిమిత్తము పంపుచు

అనంత రాధా మాయా కహానే నాయాయ్
కోటి కృష్ణ కోటిరామ్ హాయ్ యాయ్ రయ్

(రాధ మాయ అనంతమును దురవగాహమును. కోట్ల

కొలది కృష్ణులు కోట్లకొలది రాములు ఆమె మాయవలన సృష్టిస్థితిలయముల నందుచుందురు.)
అను హిందీ కీర్తనను బరించుట నుదాహరణముగా నీయ వచ్చును.

ఎప్పుడును ఆతడామెను తనకంటె నెక్కువ మాహాత్మ్యము గల దానినిగానే భావించునట్లుగన వచ్చుచున్నది. ఆతని యుపదేశమును హృదయుడు పాటింప లేదుగాని తరచు హృదయునితో "నీవు నన్నెంత యవమానించినను నా కెంత కోపము వచ్చినను ఇబ్బంది లేదు. ఆమెకు కోపము వచ్చెనా హరిహరాదు లడ్డుకోలేరు. ఆమెను మాత్ర మవమానింపకుము." అని యుపదేశించువాడు.

## 12. సమయస్ఫూర్తి—వివేకము

చదువు తక్కువైనను ఆమెకు సహజ వివేక మెక్కుడనియే చెప్పవలెను. దీనికి కొంతవరకు శ్రీరామకృష్ణుని శిక్షణ కారణమని యొప్పుకొనవచ్చును. కాని వివేక మను గుణము శిక్షణవలన పెంపొందును గాని క్రొత్తగ రాదు. అది సహజముగ నుండవలసినదే.

ఆమె సమయ స్ఫూర్తి కొక్క యుదాహృతి:— ఆ రోజులలో జయరామవటినుండి కలకత్తాకు కాలి నడకను పోవు మార్గమున తేలభేలో కైకొలా ప్రాంతములలో ఘోర మయిన అడవి యొకటి యుండెను. ఈ యడవి బందిపోటు దొంగలకు నిలయము. 1884 లోనో 1885 లోనో కొంద

జితో గలసి యామె యా మార్గమున ప్రయాణము చేయు చుండెను. తక్కిన పరిజనమంతయు ముందయి ఆమెయు నొకరిద్దఱు ముసలమ్మలు వెనుక బడిరి. తన నిమిత్తము తక్కినవారి కిబ్బంది గలిగింప నేల యని ఆమె తారకేశ్వర మున నొక దుకాణమున గలసికొందమని సంకేత మేర్పరచి వారిని వడివడిగ బొమ్మనెను. వా రొకటి రెండు మారు లాగి చూచిరికాని ఇక లాభము లేదని యా భయంకర ప్రదేశమును త్వరితముగ గడచిపోయిరి.

చిమ్మ చీకటిగా నుండెను. ఇంతలో నొక దీర్ఘమైన వ్యక్తి ఎదుట నిలువబడి నట్లాయెను. చేతులకు వెండి మురుగులు—తుప్పతల—భుజముపై నొక పెద్ద దుడ్డుకఱ్ఱ. ఆమె ప్రాణములు నిలువున నెగిరిపోవలసినదే. కాని ధైర్య మున నామె వానిని నిగ్రహించుకొనెను. "ఎవరు నీవు? ఇంత రాత్రివేళ నిక్కడ నేమి చేయుచున్నావు?" అని యావ్యక్తి బిగ్గరగా ప్రశ్నించెను. ఆమె మున్ముందు తన కాలి గొలు సులను దీసి యాతనిచేత నుంచి, "నాన్నగారూ! నేను మీ బిడ్డను. శారదను. దారి తప్పి పోయితిని. మీ అల్లుడు దక్షిణేశ్వరమున రాణీరాసమణి యాలయములో నున్నాడు." అని మధురస్వరమున బలుకు సరికి ఆ కిరాతుని గుండె నీ రయినది. ఇంతలో మరియొక వ్యక్తి వచ్చి అచ్చట నిలిచెను. ఆమె స్త్రీ వ్యక్తి యగుట పోల్చుకొని ఆతని భార్య యయి యుండునని యూహించి "అమ్మా! నేను మీ బిడ్డను. శారదను. దారి తప్పి యీ కీకారణ్యములో నటమటించు

చున్నాను. నీవును నాన్నగారును ఇప్పుడు రాకపోయిన నా గతి ఏమియై యుండును.'' అని యామె చేతులను బట్టు కొనెను. ఒక్క నిమిషములో నా బంది పోటు దంపతు లామెకు జననీ జనకులైరి. ఆమెను వెంట బెట్టుకొని 'తేల భేలో' యను గ్రామము తీసికొని పోయి తినుట కేదో ఫల హారములు దెచ్చి పరుండుటకు గూడ నొక దుకాణమున నేర్పాటు గావించిరి. ఆ రాత్రియంతయు నా బందిపోటు దొంగ ఆమెకు 'పహరా' కాయుచుండెను. మరునా డుదయముననే ఆమెను పరిజనముతో కలిపిరి. ప్రక్కనున్న చేల లోని పచ్చి బఠాణీలు పెసరకాయలు ఆమె కొంగున ముడి వైచి, "అమ్మాయి! శారదా! ఆకలి యైనప్పుడు దారిలో వీనిని దినవచ్చును.'' అని యా స్త్రీవ్యక్తి యామెకు సారె పెట్టెను. ఒకరి నొకరు వీడవలసి వచ్చినపుడు ఆ పురుష వ్యక్తి "ఇదిగో! గుడి గట్టవలె మీ తల్లి యుండ బట్టికాని నేను నిన్ను దక్షిణేశ్వరమువరకు దిగబెట్టి యుండనా?'' అని పలికెను. వారిని చూచి ఆమె యామెను చూచి వారు కన్నీళ్లు పెట్టుకొనుచుండిరి. ఈ యపూర్వ బాంధవ్యము చూచి పరిజనము ఆశ్చర్యపడుచుండిరి. ఎట్టకేలకు విడువలేక విడువలేక వా రొకరి నొకరు వీడుకొనిరి. మరల కొంత కాలమునకు బందిపోటు తలిదండ్రులు దక్షిణేశ్వరములో నామెను గలసికొనిరి. అపుడు శ్రీ రామకృష్ణుడు వారిని గౌరవముగ నాదరించి సర్వ విధముల నల్లునివలెనే సంచ రించెను. ఘోర కిరాతుల యెడ గూడ నెట్లు వర్తింపవలెనో

యీ యుదంతము స్పష్టపరచుచున్నది. ఇతరులకడ నీ యుదంతము ప్రసక్తి వచ్చినపు డెల్ల శారదాదేవి "మా బందిపోటు జనకుడు పది దారి దోపిడుల కయిన ఖామందయి యుండవలెను." అని నవ్వుచు బలికెడిది.

1885 వ సంవత్సరమున శ్రీరామకృష్ణుడు 'పానిహాతి' యను స్థలమునకు నాలుగయిదు పడవ లేర్పాటుచేసికొని అచటి యుత్సవము జూచుటకయి చాలమంది శిష్యులతోడను సిబ్బందితోడను సన్నాహపడుచుండెను. అచ్చట నేటేట జ్యేష్ఠశుద్ధ త్రయోదశినాడు గొప్ప యుత్సవము జరుగును. అందు చైతన్యసంప్రదాయమునకు సంబంధించిన సంకీర్తనము, నృత్యము, భజన వేనవేలుజనుల నాకర్షించును. "నేను రావచ్చునా" యని యొక శిష్యురాలి ముఖమున శారదాదేవి పరమహంసను ప్రార్థించినది. "మన మందఱము పోవుటలేదా? ఆమె కిష్టమయినచో నామె కూడ రావచ్చును." అని యాతడు ప్రత్యుత్తరమిచ్చెను. "ఆమె కిష్టమైనచో" నన్నమాటనుబట్టి యాతని కిష్టము లేదని గ్రహించి, "జనసమ్మర్దము నాకంతగగిట్టదు. నేను రాను. మీరు పొండు" అని ఆమె తక్కిన స్త్రీలను బంపివైచెను.

తిరిగివచ్చినతరువాత గురుదేవు డామె వివేకమునకు మెచ్చుకొనుచు "అక్కడ జనులు ఇసుకవైచిన రాలకుండ నున్నారు. నా నృత్యమున్ను సంకీర్తనమును జూచి నాతో ఆమెకూడనున్నచో 'ఇదిగో! హంసతోహంసి రానేవచ్చి

నది.' అని మొగతాళిచేసియుందురు. ఆమె రాకపోవుటయే మేలు" అని ప్రశంసించెను.

లక్ష్మీనారాయణుడను మార్వాడీ వర్తకుడు శ్రీరామ కృష్ణుని శయ్యపై దుప్పటి మురికిగనుండుటజూచి, "అయ్యో! ఇంతటి మహానుభావుడుగూడ గుడ్డకిబ్బందిపడుటా?" అని పదివేలరూపాయలు వారికి సమర్పింపబోయెను. దానిని నిరాకరించుచు పరమహంస మాతృదేవియొద్దకువచ్చి, "నీకు నేనెన్నడును చీరలుగాని † నగలుగాని విశేషముగబెట్టి యెరుగను. పోనీ ఎందులకైన నుపయోగించును. ఈ సొమ్మునీవు పుచ్చుకొనరాదా?" యని ప్రశ్నించిరి. అందులకామె వెంటనే "నేను పుచ్చుకొన్న నొకటియు మీరు పుచ్చుకొన్న నొకటియునా? లోకమంతయు మిమ్ము బూజించుట మీ వైరాగ్యముజూచి కదా! ఇపుడు మీయశస్సు నేను పంకిలముచేయనా" అని నిరాకరించెను. ఇది యామె వివేకమునకేగాక వైరాగ్యమునకుగూడ నిదర్శనము.

---

† (పరమహంస యామె నగల విషయమున బొత్తుగ నశ్రద్ధచేయలేదు. ఆలయమున బనిచేసినందులకయి అతనికి పని మానుకొన్న వెనుకగూడ నెల కేడురూపాయిలు వేతనముండెడిది. ఇదియొక్కచో ప్రోగుచేయగ నయిదువందలవరకు నిలువయుండెను. "ఆమె సరస్వతీదేవి యవతారము. అందుచే నలంకారప్రియ గదా!" అని హృదయరామునిచే మూడువందలవరకు వెచ్చించి కొన్నినగలను చేయించెను. కొంతకాలమామె వానిని ధరించినది. గాని వారి వైరాగ్యమునకు తన ముస్తాబుకు సమన్వయము కుదురదని కొంతకాలమైనవెనుక వాని నన్నిటిని దీసివైచి ఉచితములని తోచిన యొకటి రెండు భూషణములు మాత్రము ధరించుచుండెను.)

ఈ వివేక మామె నెన్నడును విడువ లేదు. ఇటీవల ప్రబోధ చంద్రుడను శిష్యుడు ఒక మారు జయరామ వటిలో రాత్రి భుజించి అక్కడకు అయిదు మైళ్ల దూరమున నున్న యొక గ్రామమునకు 'జరుగురు పని యున్నది రావల సిన' దని యెవరో యొక యుత్తరము తెచ్చిన మీాదట పోబోవుచుండగా ఆ ప్రయాణమును వారించి ఆమె యాతనితో రహస్యముగ, "ఆ యుత్తరము తెచ్చినవాడు నీకు శత్రు పక్షమువాడు కాగూడదా? అయినను గాకున్నను ఈ వానకాలమున రాత్రి ప్రయాణము మంచిది కాదు. పురుగు పుట్ర యుండును. తెల్లవారుఝామున పోదువుగానిలే" అని సలహా యిచ్చెను. తరువాత కొంతకాలమున కా యుత్తరము తెచ్చిన దాతని శత్రుపక్షము వాడే యని తేలినది. ఆ రాత్రి పోయినచో ప్రబోధుని దారిలో గాసి శత్రువులు చావ మోదియుందురు. ఇది యామె దివ్యదృష్టిచే జూచి చెప్పిన దనుకొనరాదు. వివేకవతి గనుక దూరమాలోచించినది.

ఇంకొక మారు ఒక శిష్యునితో "చూడు! శరత్ పంపిన మామిడిపండ్లు కలకత్తా నుండి జయరామవటి ఎంత శీఘ్రముగ వచ్చినవో! రైలు మార్గ మేర్పడుటచే నిట్టి శీఘ్ర యానమునకు వీలు పడినది." అని యామె ప్రశంసింపగ ఆ శిష్యు డదే యవకాశ మనుకొని బ్రిటిషు పాలనమున మనకు గలిగిన లాభములను గూర్చియు సౌకర్యములను గురించియు దీర్ఘకాల ముపన్యసించెను. ఆమె విని విని, "అయితే ఇది వరకు కంటె నిప్పుడు దేశమున నన్న వస్త్రముల కిబ్బంది

వచ్చెనందువా? లేదా?" అని ప్రశ్నించినది. అతడు నిరుత్తరుడాయెను.

క్రిందటి ప్రపంచ యుద్ధము ముగిసిన వెనుక అమెరికన్ ప్రెసిడెంటు విల్‌సన్ ప్రతిపాదించిన పదునాలుగు సిద్ధాంతములను (Fourteen points) ఒకరామెకు జదివి వినుపించుచుండిరి. ఒకటి రెండు చదువనిచ్చి, "ఇవన్నియు పైకనుచున్న మాటలు. హృదయాంతరాళము నుండియే ఇది బయలుదేరినచో నీ సరికే జగత్తు ఎంత సుఖపడి యుండవలెను?" అని యామెను పెదవి విరిచినదట.

తనకు ప్రవేశము లేని విషయములలో గూడ నామె యింత గడుసుదనమును ప్రకటించిన దన్నచో నామె వివేకమున కాశ్చర్యపడవలదా? ఆమె యుపయోగించెడు భాష కూడ విషయానుకూలముగ నుండెడిది. ఒక్కొక్కచో పండితులు కూడ వాడలేని మాటల నామె వాడి భాషకొక యాజ్జ్వల్యము ప్రసాదించెడిదట! భావానుగుణముగా మాటలను అక్షరములను ఒత్తి పలికెడిది. ఆమె మాటలోను నడవడిలోను ప్రత్యక్షమగు నాజూకు దనమునకు ప్రాభవమునకు పాశ్చాత్య వనితా మణులుగూడ ఆశ్చర్యపడుచుండువారు.†

---

†Beneath the veil of Simplicity which enveloped her, there was a lofty majesty of bearing which caught the heart and bowed it in prayerful homage at her feet. (P. 226 Days in an Indian Monastery by Sister Devamata)

## 13. మహాయజ్ఞము

శ్రీరామకృష్ణునిపై నామెకున్న యగాధప్రేమను బురస్కరించుకొని చూచినచో నాతడు భౌతికదేహమును వీడినవెనుక శారదాదేవి యెట్లు బ్రదుకకలిగినదా యని పించును. చంద్రుడస్తమించినవెనుక చంద్రిక యింకను మిగిలియుండునా ? గాఢముగ నాలోచించినచో నిదియొక యద్భుతముగ దోచుచున్నది.

మహాత్ముల చరిత్రములు మానవబుద్ధి కతీతములు. వానికిదే యర్థమని ఏ విషయమునను నొక్కిచెప్పుట సాహసము. అయినను ఏదోయొక యర్థమును గల్పించుకొనకుండ చపలమగు మానవస్వభావముండలేదు. శ్రీరామకృష్ణునిమీది యగాధప్రేమవలననే ఆమె యిట్టి యద్భుతమును నిర్వహింపగలిగినదని తోచుచున్నది. "ఎన్నాళ్లను నేనొక్కడనే ఈ భారమునంతయు మోయనా ? నీవు నాకు తోడ్పడవా ?" అని యామె నాతడు ప్రార్థించువాడు. "ఆడుదానను. నాచేతనేమగును ?" "అట్లనకుము. నీవు చేయవలసినది చాలయున్నది. మానవులు మురికిగుంటలో పురుగులకంటెను నన్యాయముగ జీవించుచున్నారు. వారి పశుజీవితమునకు నీవే పరమౌషధము వేయవలెను."

రామకృష్ణుడనగ నొక వ్యక్తిమాత్రుడు కాడు. మానవలోకమంతయు రామకృష్ణమయమే. సర్వాంతర్యామియైన యారామకృష్ణుని సేవించుటకే యామె దుఃఖమును

దిగ్రమింగి భూమండలమున నిలచినది. ఆ కథ మిక్కిలి మనోహరమైనది.

ఆతని కంఠమున నొక వ్రణము బయలుదేరినది. ఇది దుస్సాధ్యముగదోచి చికిత్సనిమిత్త మాతని శిష్యులు 1885 సెప్టెంబరు నెలలో నొకమేడ నద్దెకుతీసికొని కలకత్తా లోని శ్యామపుకురు అను భాగమున కాతని నివాసము మార్చిరి. ఎన్నో యిబ్బందులకోర్చి ఆమెకూడ నక్కడ నివాసమేర్పరచుకొని పథ్యపానాదులను తయారుచేసి యాతనిని సేవించినది. మరికొంతకాలమునకు అనగా డిసెంబరు 11 వ తేదీని కలత్తాకు సమీపముననున్న కాశీపుర మున కాతనిని మార్చిరి. ఇక్కడకూడ నామె పడరాని యిడుమలబడి వారిని సేవించుచుండెను. వ్యాధి తిరుగదని యామెకు దోచెను. సమీపముననున్న తారకేశ్వరమను ప్రదేశమునకుబోయి అచ్చటి ఈశ్వరాలయమున ప్రాయోపవేశముండెను. వ్యాధికుదురనిచో నామెకూడ మరణింపవలె నని నిశ్చయించుకొనెను. నిద్రాహారములు వర్జించి యొక రోజు పూర్తిగ గడపెను. రెండవరోజుకూడ పూర్తి కాబోవుచుండగ తెల్లవారు ఝామున నొక భయంకరమైన ధ్వని యామెకు వినవచ్చెను. ఎవ్వరో కుండలదొంతర నొక దానిని ఒక్కదెబ్బతో బ్రద్దలుకొట్టినట్టులాయెను. మా గన్నుతోనున్న యామెకు వెంటనే మెలకువవచ్చినది. మనస్సులో నేదో మెరసినట్లు అయినది. "భర్త ఎవరు? భార్య ఎవరు? ఈ లోకమున 'నాది' యనుకొనజాలిన

పదార్థమేమయిన నున్నదా ?'' అని యామె చటుక్కున లేచెను. హృదయమున వైరాగ్యభావములు గ్రిక్కిరియు చుండెను. శ్రీరామకృష్ణుని పయినున్న మమకారము పటాపంచలాయెను. ఆ చీకటిలోనే తడుముకొనుచుపోయి గుడిలోని జలసూత్రము కడనున్న జలములుగ్రోలెను. శుష్కించియున్న ముఖముపై కొంత జల్లుకొని కొంత సేద దేరిన పిమ్మట నుదయమగుసరికి వేగిరముగ బసకువచ్చెను. శ్రీరామకృష్ణు డామెనుచూచి, "ప్రాయోపవేశముంటివి గదా ? ఏమయినది ? అంతయు ననిత్యము. అంతేనా ?'' అని చిరునవ్వునవ్వెను.

ఈయుదంతము నొక మహాయజ్ఞముగ గైకొన వచ్చును. స్వార్థమును పూర్ణముగ నామె యిందు పరిహరించెను. శ్రీరామకృష్ణులకును ఆమెకును బిడ్డలమగు మన మీదనున్న ప్రేమ కిది గొప్ప నిదర్శనము. ప్రాకృత స్త్రీ బిడ్డలను చూచుకొని వారినిపెంచి పెద్దవారినిచేయు నిమిత్తము భర్తతో సహగమనము మానుకొన్నట్లే లోక కల్యాణము నిమిత్తము జగజ్జననియగు శారద శ్రీరామ కృష్ణు ననుగమింపవలెనను నుద్యమమునకు స్వస్తిచెప్పు కొనెను. ఇది శ్రీరామకృష్ణుని సంకల్పమునకు ననుగుణ ముగ నుండెనుకూడను.

1886 వ సంవత్సరము సోమవారముదయము శ్రీ రామకృష్ణుడు మహాసమాధిలో ప్రవేశించెను. అంత్యక్రియ లైన వెనుక నామె తనచేతి కంకణములు దీయబోయెను.

మనవైపున మంగళసూత్రము లెట్టివో ఆ ప్రాంతమున కంకణములట్టివి. "ఏమి చేయుచున్నావు? నేను తిరోహితుడనైనంత మాత్రమున లేననుకొనుచున్నావా?" అని శ్రీరామకృష్ణుడామెకు తేజోరూపమున ప్రత్యక్షమై వారించెను. ఆమె సభక్తికముగ చేతులు జోడించి యాయుద్యమమునుగూడ విరమించుకొనెను. సర్వమంగళ స్వరూపిణియగు నామెకు వైధవ్యమనగ నెట్టిది?

## 14. విరహిణిరాధ

పరమహంస నిర్యాణమున మాతృదేవికి దుఃఖము దుస్సహ మాయెను. తాపోపశాంతికయి యామె తీర్థయాత్ర తల పెట్టెను. యోగానందుడు, అభేదానందుడు, అద్భుతానందుడు అను సన్న్యాసిశిష్యులును మహేంద్రనాథగుప్తుడను గృహస్థ శిష్యుడును, అతని భార్యయును మరి కొందఱు స్త్రీలును ఆమె వెంట బయలుదేరిరి. 1886 ఆగష్టు మొదలుకొని రమారమి ఒక్క సంవత్సరము ఈ యాత్రలో గడచెను. వారు సేవించిన వానిలో దేవఘుర్ వారణాసి, అయోధ్య, హరిద్వారము, ప్రయాగ, బృందావనము ముఖ్య క్షేత్రములు. శ్రీ రామకృష్ణుని యస్థికలలో గొన్నిటిని హరిద్వారమునొద్ద గంగకును, ఆతని వేణిని త్రివేణి సంగమమును ఆమె యర్పించెను. కాశీలో భాస్కరానందులను అవధూతను దర్శించెను. "దిగంబరుడైన యీ మహాపురుషునికి దేహస్పృహ యేమాత్రమును లేదు." అని వారి స్థితిని ప్రశంసించెను.

దీర్ఘకాలము వసించినది బృందావనములో. రాధాదేవి తప్తహృదయమునకు బృందావనమునందలి యమునా సైకతములు సైతము కన్నీరు గార్చి యుండవలెను. మానవ చరిత్రములో నపురూప ఘట్టముగ నెన్నదగిన రాధాకృష్ణుల ప్రేమవిహారములకు బృందావనము ఉద్యానవనముగ నుపచరించుచున్నది గదా! రాధాకృష్ణులు ఎప్పుడును బృందావనములో ప్రత్యక్షమగుచుందు రనియే భక్తుల విశ్వాసము. వారి లీలలు నిత్యనూతనములు. ఈనాడుకూడ ధన్యాత్ములు వారిని బృందావనమున సందర్శింప గలుగుదురు.

బృందావనములో నడుగు పెట్టుసరికి మాతృదేవికి రాధారాణితో తాదాత్మ్యము సిద్ధించి యుండవలెను. రామకృష్ణుని విరహమున కామె హృదయముగూడ ప్రక్కలగుచుండుట లేదా? పవిత్ర చరిత్రములో నిష్కల్మష హృదయములో అగాధమైన ప్రేమభక్తిలో స్వార్థరహితమైన కల్యాణచింతలో నామెకును రాధారమణికిని ఐక్యము సిద్ధించినది. నళినీబాబుతో "నేనే యా రాధను" అని యామె స్పష్టముగ జెప్పినదట.

ఆమె వసించిన కాలాబాబు గృహమును దర్శించు భాగ్యము బృందావన యాత్ర చేసినప్పుడు ప్రకృత రచయితకు గూడ గలిగినది. 'వంశీవట' మున కది సమీపముగ నున్నది. ఈ వట వృక్షము క్రింద నిలిచి గోపికల నాకర్షించుటకయి (శ్రీ) కృష్ణుడు వంశీగాన మొనర్చెనని ప్రసిద్ధి. మాతృదేవి వసించిన మందిరమునుండి చూచినచో యమునా

నది బహు మనోహరముగ గనవచ్చును. విరహోన్మాదినియై ఆమె యమునా సైకతముల సంచరించుచుండగ బట్టుకొని పరిజనము వెనుకకు దీసికొని వచ్చెడివారు. ఆమెకు శ్రీ కృష్ణుని వంశీగానము కర్ణగోచరమైన దేమో! యోగిన్ మా శ్రీరామకృష్ణుల నిర్యాణమునకు కొంతకాలమునకు పూర్వమే బృందావనమును జేరుకొనెను. ఆమెను జూడగనే మాతృదేవికి దుఃఖ మాగినది కాదు. పసి పిల్లవలె వెక్కి వెక్కి యేడువ నారంభించెను.

దుస్సహమైన యామె దుఃఖమును జూడలేక పరమహంస తేజోరూపమున బ్రత్యక్ష మయి, "ఇంత యవివేకమా? నే నెక్కడకు బోయితిని? ఒక గదినుండి యింకొక గదికి మారితిని. అంతే కాదా?" అని యూరడించెను. ఈ క్షేత్రమున కంకణములను దీసివేయుటకయి ఆమె మరి యొకసారి యత్నింపగ నాతడు వెనుకటివలెనే బ్రత్యక్షమయి వలదని వారించెను. ఆమె తాపము తీవ్రమైన కొలది తన మాధుర్యమును మరింత హెచ్చించుచు రామకృష్ణుడామెకు నిరంతరముగ బ్రత్యక్షము గాజొచ్చెను. బృందావనము రాధాకృష్ణుల సంయోగమునకే గాక శారదా రామకృష్ణుల సంయోగమునకుగూడ లీలావనమై విలసిల్లెను.

ఒకనా డామె రామకృష్ణునితో పూర్ణముగ తాదాత్మ్యమందెను. "యోగిన్ మా" యెంత పిలిచినను పలుకదు. భయపడి యోగానందులను పిలుచుకొనిరాగా నాతడువచ్చి రామకృష్ణనామము నామె చెవిలో బిగ్గరగ

నుచ్చరించుసరికి కొంత దేహస్పృహకలిగెను. దేహస్పృహ కలుగుచున్నపుడు సరిగా రామకృష్ణునివలెనే "నాకు తినుట కేమైనను గావలెను." అన్నది. మంచినీళ్లు, ఫలాహార మును తములపాకులుదెచ్చి అచ్చట నుంచిరి. ఫలాహారము చేయుటలో, మంచినీళ్లు త్రాగుటలో, తములపాకుల ఈనెలు దీయుటలో నామె సరిగా రామకృష్ణునివలెనే సంచరించెను. అప్పుడు యోగానందులు వేసినప్రశ్నలకు రామ కృష్ణు డుపయోగించు భాషనే ఉపయోగించి, సమాధాన మిచ్చెను. ప్రాకృతస్పృహ కలిగినతరువాత రామకృష్ణుల కును తనకును ఆ స్థితిలో నైక్యము సిద్ధించెనని యామె వ్యక్తీకరించెను.

రాధికాభావమునెడల పక్షపాత మా యాత్రతో నాగి పోక తరువాతగూడ పలుసారులు ప్రత్యక్షమగుచుండెడిది. కలకత్తాలోని బాగ్ బజారులో కిరన్ చంద్రదత్తుని యింట రాధాకృష్ణుల దివ్యలీలలనుగూర్చి జతీంద్రనాథమిత్రుడను భక్తుడు హరికథ జెప్పెను. ఆ సమయమున మొదటినుండి తుదివరకు మాతృదేవి తన్మయురాలగుటచే దేహస్పృహ లేకుండెను. హరికథ ముగిసినను నామె నా యున్నతస్థితిని విడువలేదు. బలవంతముగ బండిలో గూర్చుండబెట్టి 'గోలప్ మా' యామెను బసకు దీసికొనివచ్చెను. బసకు వచ్చిన తరువాతగూడ ఆమె తన్మయురాలయి యుండెను. రామ కృష్ణుల పటమువంక తదేకదృష్టితో జూచుచు కొయ్యవలె నామె నిలువబడిపోయెను. ఆమె యవస్థకు వెరగంది అషు

తోష్ మైత్రుడను ననుచరుడు బిగ్గరగ నేడువసాగెను. ఈ యేడుపు కర్ణరంధ్రముల ప్రవేశించి ఆమెకు దేహాస్పృహ కలిగించెను. బృందావనమున నెట్టి యున్నతస్థితి కలిగినదో అట్టి యున్నతస్థితియే ఆనాడు కలిగినదని "గోలప్ మా" వచించెను. ఈ బృందావన విరహము మాతృదేవికి ప్రియతమ మైనది. ఎప్పుడు ప్రసక్తి వచ్చినను స్వార్థరహితమైన ప్రేమ కామె గోపికల నుదాహృతిగా నిచ్చుచుండును. తపానందుడను శిష్యుడు రాధావిరహమునుగూర్చి రచించిన మనోహర గీతము నొకదానిని ఆమె ప్రత్యేకముగ వ్రాయించుకొనెను.

నిధువనమునకు సమీపముననున్న రాధారమణుని మందిరమున "ఇతరుల లోపములను వేనిని గూడ నేను గ్రహింప లేకుండ జేయుము." అని ప్రార్థించినది. జగత్తంతయు నీశ్వర మయమయి నపుడు లోపము లెక్కడ గన వచ్చును? రంధ్రాన్వేషణ బుద్ధియున్నంత కాలము పరిపూర్ణత చేకూరదనియేగదా? యర్థము. పరిపూర్ణులగు వారికి పరిపూర్ణతయే ప్రత్యక్షమగునుగదా! "నాకు పరిపూర్ణతను ప్రసాదింపుము." అని యామె ప్రార్థన కర్థమనినమాట.

ఆమె యుపదేశమిచ్చుటకు అక్కడనే ప్రారంభమని కొందరు వ్రాసినారు. కాని యది సరికాదు. అంతకు పూర్వము రామకృష్ణుడు జీవించియుండగ దక్షిణేశ్వరమున శారదా ప్రసన్నున కుపదేశమిచ్చినట్లు గనవచ్చుచున్నది. మాతృదేవి వ్రేళ్లమీద మంత్రజపము నెట్లు చేయవలెనో

చూపి చెప్పినదను నిట్టి యుపదేశాంశములనుగూడ అషు తోష్ మైత్రునిలో జెప్పుటచే నీ యంశమున సందేహమున కవకాశము కానరాదు.

ఏమయినను మంత్రోపదేశమునకు విజృంభణదశ బృందావనములో నారంభమయినదని చెప్పవచ్చును. తేజో రూపమున శ్రీరామకృష్ణుడు ప్రత్యక్షమయి, "నేను యోగిన్‌కు ఉపదేశమీయలేదు. నీ విమ్ము" అని యాదేశించెను. ఆమె బిడియపడి యూరకుండగ మరలమరల నదే యాదేశము వచ్చెను. సరిగా నిట్టి యాదేశమే యోగానంద స్వామికిగూడ ముమ్మారు వచ్చెను. 'యోగిన్ మా' ద్వారా ఆతనికి కబురుపెట్టి యుపదేశమిచ్చెను. ఈయుపదేశకాలమున నామె తన్మయురాలయి యుండుటచే ప్రక్కగదిలోనున్న యోగిన్‌మాకు గూడ వినబడజాలినంత బిగ్గరగ మంత్రాక్షరముల నుచ్చరించెను.

మాతృదేవి బృందావన నివాసము చాల అర్థవంతమయినది. దాని యర్థమును మనము కొంతవరకయిన గ్రహింపగలమేని ధన్యులము. ఆమెకు రాధతో గలిగిన తాదాత్మ్యము తదుపరి కృష్ణునితో గలిగిన తాదాత్మ్యము ఆమె చేసిన ప్రార్థనము ఉపదేశప్రారంభము వీని నన్నిటిని సమన్వయించుకొని చూడవలసియున్నది. బందావనమున నడుగుపెట్టగనే మున్ముందు పైకొన్నది రాధికాభావము. రాధ స్వార్థరహితచిత్త. తన్నుగురించి యామె యెన్నడును తపింపలేదు. ఇతర జీవులు—అదే గోపికలు శ్రీకృష్ణుని జేరుకొనవలెననియే

ఎంతసేపును ఆమె తహతహ. ఈ తహతహ మాతృదేవికి గూడ గలిగి జీవులదుఃఖములనుజూచి యామె సహింపలేక పోయినది. ఈ తహతహ యుత్కంఠదశకురాగా నామెకు రామకృష్ణునితో తాదాత్మ్యముకలిగెను. అప్పుడే ఇతరుల కుపదేశించునధికారము పూర్ణముగ నామెకు సంక్రమించెను. ఆమె ప్రార్థనమువలన సమదృష్టిపయి నామెకున్న మక్కువ విశదమగుచున్నది. "ఉపదేశమిచ్చువారెక్కువవారు; ఉపదేశము పుచ్చుకొనువారు తక్కువవారు" అను భేదబుద్ధి పోవు వరకు నుపదేశమునకు సంపూర్ణమైన పటుత్వమురాదు. ఇతరుల లోపములను గణించుట, భేదభావమునకు దోహదము చేయుటయే. దీని నతిక్రమించి ఇతరుల లోపములనుగూడ గణింపక ఆమె పరమార్థజ్ఞానము దానము చేసినది.

## 15. అగ్నిగుండమున సీత

అవతారపురుషులనగానే వారు మనయొద్దనుండి పూజలు విందులు గైకొనుటకే దిగివత్తురనియు కష్టలేశమయినను వారిని స్పృశింపదనియు భావింతుము. వాస్తవమునకు ఏ యితర మానవవ్యక్తియు సహింపలేనన్ని కష్టములు వారి పాలపడును. బక్కవానికి తేలికమూట; బలశాలికి బరువు మూట! అందరికంటెను బలశాలి యవతారమూర్తి గనుక మానవజాతి సమష్టిమైమోయు దుఃఖభారమంతయు వారి భుజములపయి నిలుచును. మనలో సీతారాముల చరిత్ర మునుగాని విమతస్థాపకులలో గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు,

మహమ్మదు మున్నగువారి చరిత్రములనుగాని చూచితిమేని ఈ సత్యము తేటతెల్లమగును. ఆధ్యాత్మికాభివృద్ధి చేకూరిన కొలది వ్యక్తిత్వము నశించి విశ్వత్వము స్థిరపడును. వ్యక్తి తనయొక్క యిబ్బందులకే దురపిల్లునుగాని మహాయోగి మానవుల బాధలన్నిటికి కుమిలిపోవును.

బృందావనమునుండివచ్చిన రెండు దినములకే శారదాదేవి కమార్పుకురము బయలుదేరెను. "నా యనంతరము నీవు కమార్పుకురముపోయి మా పిత్రార్జిత గృహమున యదృచ్ఛగ నేమిలభించిన దానితో సంతృప్తి పడి జపములో నిమగ్నవుకమ్ము" అని వెనుక గురుదేవు డాజ్ఞయిచ్చెను. ఆ యాజ్ఞానుసారముగ నామె యక్కడికి బోయినది.

రామకృష్ణుడు జీవించియున్నంతకాలము కాళికాలయ స్థాపకు లాతనికి నెల కేడురూపాయల చొప్పున నుపకార వేతన మిచ్చుచుండిరి. కొందరు చెప్పిన కొండెములు విని యావేతన మామె కిచ్చుట మానివేసిరి. వివేకానందు డెంత ప్రయత్నించినను ఆమెకీ యపకారము జరుగకుండ వారింపలేకపోయెను. "అంతటి పురుషరత్నమే నన్ను విడిచిపోయెనే! ఈ వేతనము నన్నుద్ధరించునా?" అని యామె ధానిని పాటింపకుండెను.

కమార్పుకురమునకు యోగానందునితోడను 'గోలప్‌మా' తోడను కలసి యామె బయలుదేరెను. దారిలోనే యెదురుకొని కష్టము లామెకు స్వాగతమిచ్చెను.

చేతిలో చిల్లిగవ్వ లేకుండుటచే బర్ద్వానునుండి 'యుచలన్' వరకునున్న పదునారుమైళ్లును కాలినడకను నడువవలసి వచ్చెను. 'యుచలన్' జేరుకొనుసరికి ఆమె మిగుల నలసి పోయెను. "కిచూరీ" మాత్రమే తయారుచేసి 'గోలప్‌మా' వడ్డింపగ, "గోలప్! నీవంట యమృతోపమానముగనున్న" దని యామె పదేపదే ప్రశంసించుట చూడగ ఆకలి రుచి యెరుగదనుట స్థిరపడుచున్నది. ఆమెను స్వగృహమున దిగబెట్టి మూడురోజులలో యోగానందులు వెనుకకు కలకత్తా పయనించిరి. 'గోలప్‌మా' మాత్రమొక నెల దినము లుండెను.

"అయ్యయ్యో! పడుచుపిల్ల! అంచులున్న బట్ట కట్టుకొనుటేమి? దానికి తోడుకంకణములు విసర్జించకపోవుటేమి? ఏమి యీ వాలకము?" అని యా పల్లెటూరట్టుడికి పోవుచుండెను. 'గోలప్‌మా' యున్నన్నాళ్లామె తగిన సమాధానముచెప్పి వారినోళ్లు మూయించుచుండెను. ఆమె వెడలిపోయినతరువాత నీ విమర్శకులు మరల విజృంభింప సాగిరి. ఈ సమయమున ధర్మదాసులాహా సోదరియగు ప్రసన్నమాయి కలుగజేసికొని, "గదాయి (గదాధరుని ముద్దుపేరు) భార్య దేవతగాని సామాన్యవ్యక్తిగాదు." అని వాదించి వారి విజృంభణమాపెను.

ఈ నిందలు వినలేక ప్రాణము విసిగి మాతృదేవి కంకణముల దీసివేయబోయెను. కాని వెనుకటివలెనే ప్రత్యక్షమయి రామకృష్ణుడు నివారించెను. ఇక గతియేమి?

ఒంటరితనము—నిరుపేదతనము ఈ రెండును ఆమెను మిక్కిలి వేధించెను. త్రవ్వగోలతో భూమిత్రవ్వి స్వయముగ పాదులు పెట్టుకొనెను. ఈ పాదులు కాయువరకు నామె కూరలేని వట్టియన్నమే కులదైవతమగు రఘువీరునికి నైవేద్యము పెట్టి తాను తినుచుండెను. ఎంత బీదలకైన సుసాధ్యమగు నుప్పుగల్లుకూడ కొనుక్కొనుట కామెకు తాహతు లేకుండెను. ఒకనాడు శ్యామసుందరీదేవివచ్చి ఆమె యీ యవస్థచూచి పుట్టింటికి రమ్మని యాహ్వానించెను. తల్లిగారి యాజ్ఞప్రకార మక్కడకుబోయినను ఒక్కరోజుమాత్రమే యుండి ఎంత బలవంతపెట్టినను నిలువక తిరిగి స్వగృహము చేరుకొనెను. "భగవదాజ్ఞ ఎట్లున్నదట్లగుగాక ; నేను తిరిగి కమార్పుకురమే పోవుదును" అని యామె పట్టుదల వహించెను. ఎన్నికష్టములయినను లోపలికి దిగమ్రింగి వైచెడిదిగాని పైకి పొక్కనిచ్చెడిదిగాదు.

ఒక్కొక్కప్పుడు తన యసహాయదశను జూచుకొని యామె మిక్కిలి దుఃఖాకులచిత్తయయ్యెడిది. "నా కడుపున నొక్క కాయకాచినను నాకిన్ని పాట్లుండవుగా? ఈ లోకమున 'నాది' యనుకొనుటకు ఒక్కవస్తువుకూడ లేదే? నా గతి యేమగును?" అని యామె తలపోసికొనియెడిది. ఇట్టి గాఢతపస్సున గురుదేవు డామెకు ప్రత్యక్షమగువాడు. "ఏమనుకొనుచున్నావు? నీకు బిడ్డలులేకపోవుటేమి? రత్నములవంటి బిడ్డల నిచ్చితిని. క్రమేణ 'అమ్మా! అమ్మా!' యని నిన్ను వేపుకొనితిను బిడ్డలు ఇంకను ఎందరు వెలయు

దురో చూచికొనుము?'' అని తేజోరూపమునవచ్చి యామెను హెచ్చరించువాడు.

ఏడెనిమిది నెలలవరకు ఆమె యీ యగ్నికుండమున నిలువవలసివచ్చెను. రామకృష్ణుని శిష్యులలో నెవరితెన్నున వారు తపోన్మాదులయి దేశమున నలుదెసలకు బోయి యుండిరి. అందుచే వారి కామె కష్టములు తెలియవు. లేకున్న వా రుపేక్షింతురా?

తెలిసినతరువాత నామె నిట్టి యవస్థకు బాల్పరచి నందులకు వారు మిక్కిలి సంతాపించిరి. తమలోతాము చందాలువేసికొని కొంతసొమ్ము ప్రోగుచేసి కలకత్తాకు రావల సినదిగ యామెను ప్రార్థించిరి. ఇక్కడ మరియొక చిక్కు వచ్చినది. ఆమె కప్పుడు ముప్పదినాలుగు సంవత్సరముల వయస్సు. ఈ వయస్సులో తన బంధువులుకాని క్రొత్త వారితో నామె నివసించుటేనా? ఎట్టకేలకు కొందరుచేసిన ప్రోద్బలముపయి నామె కలకత్తావచ్చినది.

అది మొదలుకొని యామె మరల నెన్నడు నట్టి యవస్థ ననుభవింపలేదు. కమార్పుకురమునకు పోవుట కూడ తక్కువే. ఎంతసేపును 'జయరామవటి'కే వచ్చిపోవు చుండెను. ఉమేశబాబు అను శిష్యుడు నవ్వుచు "అమ్మా! ఎంతసేపును జయరామవటికే పోదువుగాని కమార్పుకురము త్రొక్కిచూడవేమి? ఇది మీ వంశాచారమా?'' అని తరు వాత దినములలో నొక్కప్పుడు ప్రశ్నించెను. "అది చూడగనే ఠాకూర్ భౌతికజీవనము జ్ఞప్తికివచ్చి వారి వియో

గము దుస్సహమగును. అందుచే నక్కడికి పోవుటనిన బాధాకరముగ నుండును." అని యామె సమాధాన మిచ్చెను.

## 16. పంచాతపమధ్యమందు గౌరి

1888 మొదలుకొని ఆమె ఇహలోకయాత్ర చాలించు వరకు (1920 జూలయి) ఇక నెన్నడు మాతృదేవి యిబ్బంది పడకుండ శిష్యులును ప్రశిష్యులును మిక్కిలి శ్రద్ధవహించిరి. 1888 నుండి ప్రతివత్సరమున ఆమె కొంతకాలము జయ రామవటిలోను కొంతకాలము కలకత్తాలోను ఉండుచు వచ్చెను. మొత్తముమీద ఈ రెండింటియందును సమాన కాలమే గడపియుండవచ్చునని ఆమె చరిత్ర వ్రాసినవారు వ్రాయుచున్నారు. 1909 వ సంవత్సరమున కలకత్తా వచ్చి నపుడెల్ల వసించుటకయి యొక ప్రత్యేక గృహము నిర్మించిరి. ఇది శారదానందస్వామి తన సొంత జవాబుదారీని అప్పుచేసి నిర్మించెను. ఈ గృహమున నామె అడుగుపెట్టు వరకు కలకత్తా వచ్చినప్పుడెల్ల కొలదిరోజులు మాత్రమే యున్నచో బలరామబాబు మహేంద్రనాథగుప్తుడు మున్నగు గృహస్థశిష్యుల యిండ్లలోను దీర్ఘకాలము అనగా నెలల తరబడియున్నచో నద్దె యిండ్లలోను ఉండవలసివచ్చెడిది. 1888 నుండి 1909 వరకు ఆమె జీవితము నొక ప్రత్యేక దశగా గైకొనవచ్చును. ఈ దశలో నడచిన యొక యుదంత మును ఈ దశయందలి యామె జీవితమునకంతకును—ఈ

దశయందలి యామె జీవితమునకేగాదు, మొత్తము ఆమె ఇహాజీవితమున కంతకును ప్రతినిధిగా నెన్నుకొనవచ్చును. అదియే పంచాతపవ్రతము.

1893 వ సంవత్సరమున నీలాంబరబాబు గృహము నద్దెకుగొని యామెకు నివాసముగా నేర్పరచిరి. ఇందు ఆషాఢమాసము మొదలుకొని ఎనిమిది నెలలు ఆమె వసించెను. ఈ కాలమున నెన్నో మహోదంతములు నడచినవి. అందామెకు కలిగిన నిర్వికల్పసమాధి యనుభవమునుగూర్చి యీ వరకే ముచ్చటించుకొంటిమి. ఈ పంచాతపవ్రతనిర్వహణముకూడ ఆ యింటనుండగనే జరిగినది.

దీనినిగూర్చి ఉమేశబాబు అను శిష్యునితో నామె యీ తీరున జెప్పినది. "నాయనా! చూడు, శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరము నాకు పిచ్చియెత్తినట్లయినది. ఎక్కడను హృదయమునకు శాంతి యను మాట లేకుండెను. మతిలేని నా యవస్థనుజూచి 'యోగిన్‌మా' "అమ్మా! మనము పంచాతపము నిర్వహింతము. దానితో నీశోకాగ్ని చల్లారును." అన్నది. నేను సరేయని యొప్పుకొంటిని. చతురముగ నాలుగుచోటుల పిడకలు దాలివైచి అయిదేసి మూరల దూరములో నగ్నుల నేర్పరచిరి. పైసి నడువేసగిలోని సూర్యమండలము. ఈ యయిదగ్నుల నడుమను మేము గూర్చుండవలసియుండెను. అవి చూడగనే నాకు భయము వైచినది. స్నానముచేసి ఆ యగ్నులను సమీపించితినిగాని ఈ యగ్నుల నడుమ గూర్చుండుట ఎట్లు సాధ్యపడునాయని

యాలోచించుచుంటిని. యోగిన్ మా "అమ్మా! భయము లేదు. లోపలికి రమ్ము" అని నన్ను హెచ్చరించినది. "ఠాకూర్" నామమును స్మరించుకొనుచు అందు ప్రవేశించితిని. నాకా యగ్నులవేడిమి ఏమియు కానరాలేదు. కాని వ్రతము పూర్తియైన మైదుదినములకు నల్లగ మసి బొగ్గువలె తయారైతిని."

ఈ పంచాతపమును పార్వతి శివుని భర్తగా గోరి తపస్సు చేసినపుడు పాలించెనని ప్రసిద్ధి. కష్టాగ్నుల నడుమ భగవన్నామము నుచ్చరించుచు గడపిన మాతృదేవి జీవితమెల్ల నీ వ్రతమున బ్రతిబింబించుచున్నది. అందును ముఖ్యముగ 1893 మొదలుకొని 1909 వరకు ఆమెకు తటస్థించిన తీవ్రవియోగములను అగ్నులతో బోల్చుటలో నతిశయోక్తి యచ్చునకైన నుండదు.

1897-న యోగానందస్వామి నిర్యాణము. మరి యారు నెలలకు ఆమె ముద్దుతమ్ముడైన యభయచరణుని వియోగము. 1904 లో నీలమాధవులను పినతండ్రి వియోగము. 1905 లో నామె తల్లి శ్యామసుందరీదేవి వియోగము. ఈ నలువురును ఇహలోకయాత్ర చాలించినపుడు ప్రాకృత స్త్రీవలె నామె గొంతెత్తి యేడ్చినదట. వీనితో తుల్యముగ గణింపరాకున్నను 1890 లో బలరామబోసు వియోగము కూడ ఆమెను మిక్కిలి బాధపెట్టినది. అభయచరణుని మరణమువలన నామె వెంపటికింపవలె నెన్నటికిని తెగని జంజాటమున జిక్కుకొనవలసివచ్చినది. ఇది సూర్యమండ

లమువలె నార్పుదమన్నను నారిపోకుండ స్థిరముగ నిలిచిన యగ్ని. బృందావనమున యోగానందుల కుపదేశమిచ్చిన సంగతినిగూర్చి యీవరకే ముచ్చటించుకొంటిమి. ఈ యోగానందుని ఆమె యెంతో గాఢముగ ప్రేమించినది. పండ్రెండు సంవత్సరము లాత డీమె భారమును వహించి నాడు. ఎవ్వరైనను తనచేత నొక్క యర్ధరూపాయి యుంచి నను సరే యది మాతృదేవి నిమిత్తము ముడుపుగ గట్టి పెట్టెడివాడు. మాతృదేవిచుట్టును బంధువులేమి శిష్యు రాండ్రేమి పదిపండ్రెండుగురికి తక్కువయుండెడివారు కారు. ఈ పరిజనమంతయు కలకత్తావచ్చినపుడు వారికి బస నేర్పాటు చేయుట మొదలుకొని సమస్త సౌకర్యములు నమర్పవలసి యుండెను. జయరామవటిలోగూడ వారి జీవనము నిర్వ హింపవలెను. అందుచే మాతృదేవి భారమును నిర్వ హించుటనిన నెంతటి బాధ్యతతోగూడిన వ్యాపారమో యూహించుకొనుట సుకరము. ఈ బాధ్యత నాతడు పూర్ణ ముగ నామెను పరిజనమును సంతోషపరచుచు నిర్వహింప గలిగెను. ఎంతసేపును 'స్త్రీల నడుమనే నివాస'మని తక్కిన రామకృష్ణుని సన్న్యాసిశిష్యు లాతనిని గేలిచేసినను సరకుగొనువాడుగాడట. ఆమెకు యోగానందునిపై గల వాత్సల్యము నీక్రింది యుదంతముబట్టి యూహించుకొన వచ్చును. యోగానందుడు తన కిచ్చిన బొంత యొకటి పాతబడి చినిగిపోవుచుండగా బాగుచేయించుకొని రమ్మని విభూతిభూషణుని కిచ్చెను. అంతలోనే ఆ బొంతను వెను

కను దీసికొని, "బాగుచేసినచో దీని స్వరూపము మారును. యోగిన్ నా కెట్టి స్వరూపములో నిచ్చినాడో యానవా లయిన లేకుండబోవును. అది నా కభిమతముగాదు. ఈ బొంత యాతని స్మృతిచిహ్నము గదా!" యన్నదట.

అభయచరణుడు శ్రమపడి మెట్రిక్యులేషను ప్యాసయి మెడికల్ స్కూలులో వైద్యము నేర్చుకొని వైద్యవృత్తిని నిర్వహించుట కుద్యుక్తుడయియుండెను. ఇట్టి సిద్ధాన్నమును దైవము కాలితో దన్నివైచెను. చనిపోవుసరికి అతని భార్య సురబాల గర్భిణిగానుండెను. ఆమె తల్లి చిన్ననాడే చని పోవుటచేత పినతల్లియు అమ్మమ్మయు నామెను పెంచిరి. వారిరువురును రోగగ్రస్తులయియుండగ కలరావచ్చి అభయ చరణుడు మృతిజెందెను. పోవుటకు ముందు సోదరియగు శారదాదేవి మోముపయి తన దీనదృష్టిని బరపి, "అక్కా! నా కుటుంబమునకు నీవే దిక్కు" అని యొప్పగించెను. అది మొదలుకొని సురబాలను నామె ప్రసవించిన రాధా రాణిని ఎన్నో కడగండ్లకోర్చి యామె పోషించుకొనివచ్చెను. దీనినిగూర్చి మరియొకచో విపులముగా బ్రస్తావించుకొందము.

నీలమాధవుడు భగవద్భక్తుడు. నైష్ఠికబ్రహ్మచారి. అతడనిన మాతృదేవికి మిక్కిలి గౌరవము. అతడు చని పోవుటకు ముందు తనకు ఎక్కడెక్కడినుండియో అపు రూపములని శిష్యులు దెచ్చియిచ్చిన పండ్లలో చాలమట్టు కాతని నిమిత్తమయి దాచియుంచెడిది. ఇది తక్కినవారి కసూయ కలిగించెడిది. "మన కింకను కొంతకాల మాయు

ద్దాయమున్నది. మనము సావధానముగ వీనిని దినవచ్చును. ఆతడు చనిపోవుచున్నాడు గదా. అందుచే ప్రత్యేకముగ నాతని నిమిత్తము దాచియుంచుచున్నాను.'' అని యామె సమాధానము చెప్పెడిదట!

శ్యామసుందరీదేవి దేవతగ నెన్నదగినదిగాని మనుష్యవ్యక్తిగాదు. శారదాదేవిని గన్నతల్లి మరియొక తీరున నెట్లుండును? "నేను బ్రతికియున్నంతకాలము బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు జగదంబ మున్నగు దేవతలుకూడ నాతోపాటు నాయింట వసించుచుందురు.'' అని యామె పలికెడిదట. రామకృష్ణుని శిష్యులన నామె కపారప్రేమ. వారికి దూరముననుండియే స్వాగతమిచ్చెడిది. వారివారికి ప్రియమైన పదార్థములను ఎన్నాళ్లుగనో దాచిపెట్టెడిది. శ్రీశ్రీవిరజానందస్వామి మాతృదేవి శిష్యులలో నొక్కరు. వారు మాతృదేవిని సందర్శించిన ప్రథమతరుణమునుగూర్చి వ్రాసియుంచిరి. దాని భాషాంతరీకరణము 1954 మార్చినెల ప్రబుద్ధభారతిలో ప్రచురింపబడినది. అది చదివినచో శ్యామసుందరీదేవి ఎంత సరళస్వభావురాలో దయార్ద్రహృదయయో సువ్యక్తమగును. ఆమెను శారదాదేవి శిష్యులు "డీడీమా'' (అమ్మమ్మా) అని పిలుచుసరికి ఎక్కడలేని యాప్యాయము వర్షించెడిదట! అత్యుల్లాసముతో మాటాడుచు మాటాడుచు డీడీమా తన ప్రాణములను విడిచిపెట్టెను!! బలరామబోసు రామకృష్ణుని గృహస్థశిష్యులలోకెల్ల నగ్రగణ్యుడని మాతృదేవి వచించెడిదట. ఒకమారు రామకృష్ణులు జీవించి

యుండగ బలరామబోసు భార్యకు చాల జబ్బుచేసినదట. మాతృదేవిని పోయిచూడవలసినదిగ గురుదేవు డాజ్ఞాపించిరట. "పల్లకీలేదు. బండిలేదు. పోవుటయెట్లు?" అని యామె సంకోచించుచుండగ "నడచిపొమ్ము. మన బలరాముని యిల్లు మొదటికి గూలిపోవనున్నపుడు 'దేనిమీఁద పోవుట' యని సంకోచమా?" అని రామకృష్ణులు వేగిరపెట్టిరట. బలరామునియందు రామకృష్ణుల కెట్టి వాత్సల్యమో నిర్ణయించుకొనుట కీయొక్క యుదంతమే చాలును. ఆ తరుణమున నేదో పల్లకి లభించినదటగాని వేరొక తరుణమున నామె కాలినడకనే బలరాముని యింటికి బోయి జబ్బుగనున్న యాతని భార్యను సందర్శించెనట!

ఈ కాలమున నామె జగన్నాథము (పూరి) రెండుసారులు తీర్థయాత్ర సేవించినట్లు గనవచ్చుచున్నది. ఒకసారి కటకమువరకు మాత్రమే రైలుమార్గముండుటచే అక్కడనుండి నాటుబండిమీఁద పోవలసివచ్చెనట. త్వరితముగ పూరిచేరుకొనుటకయి రాత్రియంతయు శారదానందస్వామి స్వయముగ బండితోలెనట.

నీలాంబరబాబు ఇంటిలోనుండగనే నాగమహాశయులామె నొకసారి దర్శింపవచ్చిరి. ఆమె నిమిత్తము దెచ్చిన మిఠాయి నామెయే స్వయముగ నాగమహాశయుని నోటనుంచి తినిపించుచుండగ వారు "నా కిప్పుడు ప్రత్యక్షమయినది. తండ్రికంటె తల్లి ఎక్కుడు దయార్ద్రహృదయ" అని హర్షోత్కర్షమున చంకలువైచుకొనిరట. వేరొక సందర్భ

మున, "ఎందరో మహాభక్తులిచ్చటికి వచ్చిపోవుచుందురు. కాని ఒక్కరును నాగమహాశయునితో తుల్యులుగారు." అని యామె ప్రశంసించినదట.

గృహస్థజీవితమను పంచాతపమధ్యమున కుమిలిపోవు నామె హృదయమున కిట్టి భక్తమణుల సల్లాపసాంగత్యములు నడుమనడుమ మధువృష్టివలె నుపచరించెడివి కాబోలును.

## 17. బంధుప్రేమ

శారదాదేవి విశిష్టలక్షణములలో బంధుప్రేమ యొకటి. మమకారముతో నిండిన పామరజనుల బంధుప్రేమ సాధారణముగ మనకు గనవచ్చుచుండును. కాని శారదాదేవి బంధుప్రేమ విశ్వప్రేమకు ప్రత్యక్షచిహ్నము. ఉపాధిని స్వీకరించిన యెట్టి వ్యక్తియు విశ్వమునంతను ఒక్కమారుగ కౌగిటబంధించుట అసంభవము. ప్రేమప్రవాహము నదీప్రవాహమువలె అఖండ సచ్చిదానందమను మహాసముద్రమున నుదయించి దానిలో లయించుచున్నది. నడుమ మాత్రము మానవలోకము నది పునీతముచేయును. మానవలోకమనినప్పుడు ప్రపంచమునంతను అది ముంచెత్తుట సంభవింపదు. ఏవో కొన్నిభూముల నాశ్రయించుకొని ప్రవహించును. అట్టి భూములలో బంధుజనమొకటి. బంధుజనులయెడ శారదాదేవి చూపిన ప్రేమనుబట్టి ఆమె హృదయమునకు లోతుకట్టుట కొంతవరకు సుకరమగును.

శరీరసంబంధమునుబట్టి తలిదండ్రులు తోడబుట్టువులు వారి బిడ్డలు జన్మభూమియగు జయరామవటి వాస్తవ్యులు వీరి నందఱిని ఆమె బంధుజనముగ గణించవచ్చును. తన తలిదండ్రులనిన నామెకు ప్రేమయేగాక వారు పరమభక్తు లగుటచే గౌరవముకూడ నుండెను. ప్రసన్నకుమారుడు, వరదప్రసాదుడు, కాళీకుమారుడు, అభయచరణుడు అను నలుగురు సోదరు లామెకుండిరి. శ్యామసుందరీదేవి చని పోయిన యనంతరము కొంతకాలము గడచినపిమ్మట మాతృ దేవి శారదానందులను బిలచి తన యన్నదమ్ముల వాటాలు తెగగొట్టుమని నియోగించెను. వారి వాటాలు విభజన మయినతరువాత ఆమెతరచు ప్రసన్నకుమారుని యింట నుండెడిది. ఈ ప్రసన్నకుమారునికి మొదటి భార్యవలన 'మాకు' 'నళిని' అను నిద్దరు పుత్రికలుండిరి. ఈ పుత్రికలను పెంచవలసిన భారము మాతృదేవిపై బడెను. ఏలయన నాతని రెండవభార్య చిన్నదగుటచే నా భారము వహింప లేకుండెను. తన పోషణనిమిత్తము శిష్యులిచ్చిన ధనము నంతను ఆమె తన సోదరులకును వారి కుటుంబములకును వినియోగించుటయేకాదు. చెమటయూడ్చి పనిచేసెడిది కూడ. బంగాళాదేశమున నుప్పుడుబియ్యమే యెక్కువగ వాడుచుందురు. ధాన్యము నుడకబెట్టుట దాని బియ్యముగ తయారుచేయుట (దీనికయి వారు ప్రత్యేకముగ నొక చేతి మర నుపయోగింతురు) అన్నమువండుట, అంట్లుతోముట మొదలయిన పనులన్నియు తన సోదరుల యిండ్లలో నామె

స్వాయముగ జేసెడిది. 1954 ఏప్రిలు నెలలో నేను జయరామవటిపోయినపుడు విభూతిభూషణుడను మాతృదేవి శిష్యుడు నాకొక తటాకమును జూపి, "ఇదిగో దీనిలోనే మాతృదేవి గృహపాత్రములను పరిశుద్ధముచేసెడిది." అని పలికెను. ఆమె తన సోదరుల కుటుంబములకు చేయు సేవను తిలకించి గిరీశచంద్రఘోషు "ఈ సోదరులు పూర్వజన్మములో కాళికాదేవికి తమ తలలు బలియిచ్చియుందురు. లేకున్న మాతృదేవి యింతగ వారికి సేవచేయుట తటస్థింపదు." అని పలికెనట.

మాతృదేవి సోదరులలోకెల్ల తెలివితేటలు పేరు ప్రఖ్యాతులు సంపాదింపదగినవాడు అభయచరణుడు. ఈ అభయచరణు డకాలమృత్యువు వాతబడుట మూలముగ మాతృదేవికి శాశ్వతమైన జంజాట మేర్పడెనని యిదివరకే వ్రాయడమైనది. ఈతని భార్య సురబాలకు మగని యకాలమృతి కారణముగ మనోవైకల్యమేర్పడెను. దానికితోడు ఒకనాడొక దొంగ యింటిలోబడగ నామె కకస్మాత్తుగ మెలకువవచ్చి వెఱ్ఱికేకలువేసెను. అది మొదలుకొని ఆమె కున్న మతికూడపోయెను. ఈ సురబాలకు రాధారాణియను నొక కుమార్తె యుండెను. ఈమెను 'రాధి' యని 'రాధు' అనియుకూడ ముద్దునకు బిలచుచుండిరి. రాధు మిక్కిలి యందమైనది. సరళస్వభావ. మనస్సులో నెంతయున్నదో పైకంతయు ననివేయవలసినదే. ఈమెయే మాతృదేవి యిహజీవితమున కాలంబనమని చెప్పవచ్చును. ఈ రాధును

మాతృదేవి తన యభిమానపుత్రికగ గైకొనెను. పిచ్చి యెత్తిన తల్లిబారినుండి యామెను రక్షించి, పెంచి, పెద్ద దానినిచేసి, విశేషవ్యయమునకోర్చి, కట్నములు, కానుకలు నిచ్చి పెండ్లిచేసెను. పెండ్లిచేసిన తరువాతగూడ 'రాధ' తన భర్తతోగలసి మాతృదేవి తోడనేయుండెను. ఆమె పురుళ్లుకూడ మాతృదేవియే పోయుచుండెను. 'రాధి' మిక్కిలి యర్భకురాలగుటచే పురుడువచ్చినపుడెల్ల రెండు తలలు నేర్పడువరకు పెద్దగండముగ నుండెను. అప్పుడు మాతృదేవి పడు నారాటమునకు మేరలేకుండెను. సుర బాలకుగాని 'రాధ'కుగాని మాతృదేవిపై ప్రేమలేదని వచిం చుట సత్యమునకు దూరము. వారిరువురును ఆమెను గాఢ ముగ ప్రేమించిరి. అయితే వారు వివేకశూన్యులగుటచే ఆమె మనస్సుకు తాపముకలుగునట్లు ఈ ప్రేమను వ్యక్తీక రించుచుండిరి. ఎక్కుడు చనవుతీసికొని మంచిచెడ్డలు తెలియ కుండ నామెను పదేపదే దూషించుచుండిరి. రాధి ఒక్కొ క్కప్పుడు మాతృదేవిని కొట్టుచుండెడిది; తన్నుచుండెడిది కూడ. వీని నన్నిటిని సహించుకొని మాతృదేవి తన యవ్యాజవాత్సల్యమును వారిపై వర్షించెడిది.

ఒక్కొక్కప్పుడు మాతృదేవికిగూడ కోపమాగెడిది కాదు. సురబాల యొక సమయమున మాతృదేవిని దూషిం చుటతో నాగక ఆమె తల్లిదండ్రులనుగూడ దూషింప నారంభించెనట. అందుపై మాతృదేవి "పూజ్యులైన నా తలిదండ్రులను దూషింతువా? నీకు కుష్ఠురోగము

రావలెను.'' అని తీవ్రముగ శపించెనట. ఆమెమాట ప్రకారము నిజముగ సురబాలయొడలిపై మచ్చలు బయలు దేరెను. వెన్నవంటి మాతృదేవి హృదయము దానికి జాలి పడి మందు రాయబోగా ''చాలులే నీకరుణ. ఈ రోగము నీప్రసాదమే గదా! క్రింద ఎసరుపెట్టి పైని నీళ్లుజల్లవచ్చి తివా ?'' అని సురబాల దెప్పిపొడిచెను.

తనతమ్ములు తన్నుతరచు ధనము నిమిత్తము వేధించు కొని తినగ మాతృదేవికి విసుగువచ్చి, ''పొరపాటుననైన వీరు భక్తివైరాగ్యములను వాంఛింపరుగా'' అనుకొను చుండెడిదట. అంతమాత్రముచే వారిని దురాశాపీడితులని గాని భక్తిశూన్యులనిగాని నిందించుట తగదు. పెరటిలో కల్పవృక్షమున్నప్పుడు దానిని దులుపుకొనజూచుట ఇంటి వారి నేరమా? జగదంబ తమకు సోదరియైనపుడు ఏ యిబ్బందివచ్చినను ఆమెను తప్పించి వారెవరిని వేడు కొందురు? శారదాదేవి అప్పుడప్పుడు చూపు విసుగుదల యామె శీలముననున్న మానవత్వమును మరింత దృఢపర చుచు నందగింపజేయుచున్నది. ఒక్కమారయిన విసుగు కొనకుండ నామె సదా యొకేమాదిరి స్థాణువువలె సంచ రించియున్నచో ఆమె జీవితము కొయ్యబారిపోయి మానవ లోకమునకు దూరమయియుండెడిది.

మాతృదేవి కలకత్తావచ్చినప్పుడెల్ల పెద్దపటాల ముతో వచ్చెడిది. 'నళిని', 'మాకు' వారి భర్తలు, వారి పిల్లలు ''రాధు'' ఆమె భర్తపిల్లలు ఇంకను మరికొందఱు –

ఇంత సిబ్బందితో బయలుదేరెడిది. వీరందరికి సమస్తోపచార ములు చేయుటకు ద్రవ్యము సంపాదించుట శారదానంద స్వామికి భారమైన యుద్యోగమే. కాని ఆ మహాపురుషుడు ఎక్కడను విసుగుకొనకుండ మాతృసేవచేసెడివాడు.

జయరామవటియనిన నామె కెంత ప్రేమయో ఈ క్రింది యుదంతమువలన తెలియనగును. ఒకమారామె జయరామవటినుండి కలకత్తా బయలుదేరుచుండెనట. ఆమె దగ్గర బంధువొకతె "తల్లీ! పోయిరా" అని సాగనంపిన దట. అప్పుడు మాతృదేవి జయరామవటిలోని నేలనున్న మట్టిని ఫాలమున కద్దుకొని "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అను వాక్యము నుచ్చరించుచు "పోయిరానా? మరల మరల వచ్చుచుందును. ఈ గ్రామమునందలి ధూళి కూడ నాకు పరమపవిత్రమైనది." అని పలికెనట. జయ రామవటీ వాస్తవ్యుల కేకష్టమువచ్చినను ఆమె కడకుబోయి చెప్పుకొనెడివారు. వెంటనే దాని నామె నివారింపగలదని వారి విశ్వాసము. "అమ్మా! ఎక్కడెక్కడనుండియో మహాపురుషులు నీ దర్శనార్థమయి వచ్చుచుందురు. మాకు నీ గొప్పదనమేమియు తెలియదు గదా!" అని యమాయకు డగు జయరామవటి వాస్తవ్యుడొక డొకప్పు డామెతో బలుకగ నామె చిరునవ్వుతో "తెలియవలసిన యగత్య మేమున్నది?" అని సమ్మోహపరచెనట.

ఆమె జీవితమున నీ బంధుప్రేమ యెట్టి మహత్తర మైన శక్తియో నిరూపించుట కష్టసాధ్యము. రామకృష్ణుల

నిర్యాణానంతరము పరమపరిశుద్ధమైన ఆమె మనస్సు నిలుచుట కెద్దియు నిహలోకమున నాలంబనములేక యల్లాడుచుండగ శ్రీరామకృష్ణులు దివ్యదర్శనమిచ్చి యొక బాలికనుజూపి, "ఆ బాలికపయి నీ మనస్సు లగ్నము గావింపుము." అని యాజ్ఞయిచ్చిరట. ఆ బాలికయే 'రాధి'. ఈమె ప్రక్కలో లేకపోయినచో మాతృదేవికి నిద్రపట్టెడిది గాదట. కొన్నాళ్లు వేరొక మంచమున శయనింప యత్నించియు విఫలప్రయత్నయయి మరల రాధికను దగ్గరకు దీసికొనెను. రాధికను దగ్గరకు దీసికొనెననగ లోకమునందలి మనలనందరను దగ్గరకు దీసికొన్నట్లే యర్థము. అందుచే నీ రాధారాణిని మనము పూజింపవలసిన యగత్యమెంతైన నున్నది. ఆమెయే యాలంబనముగ లేకున్న మాతృదేవి తన యిహజీవితనాటకమున కేనాడో భరతవాక్యము జెప్పి యుండెడిది.

## 18. మాతృభావము

శారదాదేవి యంతఃకరణమును చిత్రింపవలెనన్న 'మాతృభావ' మను నొక్కమాట చాలును. శ్యామసుందరీ రామచంద్రులను సేవించుటలో నామె పుత్రికాభావము ప్రకటమయినది. ప్రసన్నకుమారుడు అభయచరణుడు మున్నగు సోదరులను వారి కుటుంబములను సేవించుటలో నామె సోదరీభావము ప్రకాశించినది. రామకృష్ణుని సేవించుటలో నామె పత్నీభావము ప్రత్యక్షమయినది.

శిష్యుల కుపదేశమిచ్చుటలో నామె గురుభావము ప్రస్ఫురింపనున్నది. వివిధములుగ దోచు నీ భావముల కన్నిటికిని ఐక్యము నొడగూర్పజాలిన సమన్వయస్థానము ఆమె మాతృభావమే.

ఇప్పటికిని 'అమ్మా' యని పిలచినచో నామె తాళలేదు. ఎంత ముఖ్యమైన పనియున్ననుసరే దానినంతను గట్టిపెట్టి పిలుచుచున్న బిడ్డచెంతకువచ్చి నిలువవలసినదే!

గిరీశచంద్రఘోషు ఒకప్పుడు ప్రశ్నించెను, "నిన్ను తల్లీ! యనుచుందుమే. ఎట్టి తల్లివి?" అని. దాని భావము నామె గ్రహించుకొని "రామకృష్ణుని భార్యను కాబట్టి నన్ను మీరు తల్లిగా భావింపనక్కరలేదు. నేను మీకు దత్తతతల్లినిగాదు. పినతల్లినిగాదు. సవతితల్లిని మొదలే కాదు. మాటవరుసకు తల్లీయని మీరు నన్ను పిలువనక్కరలేదు. భౌతికశరీరమునకు కారణమగు తల్లికంటె నపారము నగాధమునగు ప్రేమను వర్షింతును." అని యామె సమాధానము చెప్పినది. ఈ సమాధాన మెంత వరకు సారవంతమైనదో పరీక్షించినవారు ఆ పరీక్షా ఫలితములను స్వయముగ ననుభవించినవారు ఇప్పటికిని సజీవులై యున్నారు.

ఆమె తన మాతృభావమును ప్రకటించిన మార్గములలో కొన్నిటి నిట చేర్కొనుచున్నాము. తన బిడ్డల యాధ్యాత్మికాభివృద్ధి నిమిత్తమేగాక వైహికక్షేమమును గూర్చికూడ సదా పరితాపపడుచుండుట యొకటి. దూరము

నుండి యుపదేశార్థమువచ్చిన శిష్యులకు అన్నము వండి పెట్టుట, విస్తరితీసి పేడపెట్టుట పరుండుటకు ప్రక్కవేయుట మున్నగు నికృష్టసేవలుగూడ చేసెడిది. ఎంత యసందర్భపు ప్రార్థనములయినను సరే భక్తులయొద్దనుండి వచ్చినచో విధి విరామములులేకుండ వాని నామె చెల్లించుట రెండవది. ఇతరు లే వ్యాధులచే బాధపడుచున్నను ఆ వ్యాధులు తాను గైకొని బాధపడుట మూడవది. పూర్ణమైన త్యాగమున కును ఎక్కడ విసుగుదలలేని సేవకును ఆదర్శప్రాయమైన జీవితమును నడపుచు దాని మూలమున నితరుల జీవితము లను ఉన్నతస్థాయికి గొనిపోవుట నాలుగవది. అన్నిటి కంటెను ముఖ్యమైనది – ఎన్నో యద్భుతమైన యనుభూతుల వలన నామె యాధ్యాత్మికోన్నతిని గడించినది గదా. ఈ యున్నతిని వినియోగించి జననమరణములలో గొట్టుకొనుచు తపించు జీవులను దరిజేర్చుచుండెడిది. ఇందు కామె విని యోగించు సాధనములలో ముఖ్యమైనది యుపదేశప్రధా నము. (దీనికయి ప్రత్యేకముగ నొక యధ్యాయమును విని యోగపడును.)

మాతృభావము ఆమెకు సహజసిద్ధము. 1864 బంగాళాదేశమున పెద్దకరవు వచ్చినది. అప్పటి కామెకు పదియేండ్ల వయస్సుకంటె నుండదు. దీనదయాళుడగు నామె తండ్రి రామచంద్రముఖర్జీ తనకున్నదా? లేదా? యనియైన చూచుకొనకొండ నన్నదానము చేసెడివాడు. కిచూరీ (పులగము) తయారుచేసి గూనలతో పోసియుంచెడివాడు.

ఎట్టి భేదమును లేకుండ నెవ్వరువచ్చినను ఆ 'కిచూరీ' వడ్డింప వలసినదే. ఈ వడ్డనకై శారదను నియోగించెను. త్రెడ్డు చేతపుచ్చుకొని ఆకలితో నటమటించువారికెల్ల 'కిచూరీ' వడ్డించు నామె విగ్రహము కాశికాపురమున బంగారు త్రెడ్డుతో తైర్థికులకన్నము వడ్డించు విశాలాక్షిని స్ఫురింపజేయును. విభూతిభూషణుడు నాతో నొక యుదంతమును జెప్పినాడు. జయరామవటిలో గిరీశఘోషొకనాటి యుదయకాలమున నొకబిచ్చగానిని బిలచి మాతృదేవి కుటీరము చెంతకుబోయి "అమ్మా! ఆ యన్నపూర్ణవు నీవే కావా" యను మకుటము గలిగిన బంగాళీకీర్తన మామెకు వినబడునట్లు పాడుమని ప్రోత్సహించెనట.

జయరామవటిలో 'భవానితల్లి' యను వృద్ధురాలొకతె యుండెను. ఈమె దిక్కులేనిది. మాతృదేవి యామెను తన యింటనుంచుకొని తుదిగడియలవరకు రక్షించి యామె ముప్పుగడపెను. బానర్జీలకుటుంబములో నొక స్త్రీకి చెవిలో కురుపువేసి ఎవ్వరును సమీపించుటకు వీలులేనంతగ వాసనగొట్టుచుండెను. ఈ వాసన భరింపలేక బంధువులు సైతము ఆమెను విడనాడిపోయిరి. 'కోల్ పరా' యాశ్రమమునుండివచ్చిన యొక శిష్యునితో మాతృదేవి యీ సంగతి చెప్పగ నా శిష్యుడు వెంటనే యామెను తన యాశ్రమమునకు తోడ్కొనిపోయెదననెను. మాతృదేవి మెలకువ చూడుడు, "నీ యాశ్రమమునకు నీవు పెద్దవుకావు కదా! అధ్యక్షులను కనుక్కొనివచ్చి మరి తోడ్కొని

పొమ్మ''ని ఆమె హెచ్చరించెను. అధ్యక్షుల యనుమతిని గైకొని యా యనాథను దీసికొనిపోవుటకయి యాతడు వచ్చుసరికి మాతృదేవి ముఖమున లాస్యమాడు నానందము నకు మేరలేకుండెను. అవ్యాజప్రేమయన నెట్టిదో తన కానాడు మాతృదేవి ముఖమున స్ఫురించినదని యా శిష్యుడు పలికెను. 'రామకృష్ణపుథి' యను గ్రంథమును రచించిన అక్షయకుమారసేనుడను కవి యొకప్పు డామెకు కొన్ని పండ్లు పంపెను. ఆ పండ్లు తెచ్చిన కూలిమనిషి యారాత్రి మాతృదేవి యాశ్రమములో నివసింపవలసివచ్చెను. ఒకరాత్రివేళ మలేరియాజ్వరము సోకుటచే నా మనిషికి భోజనము వమనము వెళ్లిపోయెను. అందరికంటెను పెందలకడలేచు టలవాటగు మాతృదేవి యదిచూచి తక్కినవారు లేచి యా కూలిమనిషిని చీవాట్లుపెట్టుదురని ఎవ్వరికిని తెలియకుండ తానే స్వయముగ ఆ వమనమును దీసివేసి యా ప్రదేశమును శుభ్రముచేసెను.

ఆమె ప్రేమ జాతిభేదముల నతిక్రమించినది. పూర్వాచారపరాయణమగు కుటుంబములో పుట్టిపెరిగినను 'గోలప్మా' మున్నగువారికి తెలియకుండ శూద్రశిష్యులు దెచ్చియిచ్చెడి వంటకముల నామె భుజించెడిది. హైందవులలోనున్న జాతిభేదములను మాత్రమేగాక ప్రాక్పశ్చిమజాతిభేదములనుగూడ నామె యతిక్రమించినది. వివేకానందునితో వచ్చిన 'నివేదిత' 'ఓల్‌బూల్' మున్నగు పాశ్చాత్యవిదుషీమణులకు తనగదిలో బసనిచ్చుటయేగాక వారిని తన

మంచముమీఁదనే ఘరుండబెట్టుకొని వారి సహాపఙ్క్తిని భుజించెడిది. "హైందవులు నా బిడ్డలయి యాంగ్లేయులు కాకుందురా?" అని యామె ప్రశ్నించెడిది. "Days in Indian Monastery" "హైందవాశ్రమమున గడపిన దినములు" అను గ్రంథములో అమెరికాఖండమునుండి వచ్చిన యొక మహాభక్తురాలు మాతృదేవి దర్శనము, సాంగత్యము నెంత యానందప్రదముగ నుండెడివో జాతిమతాదిభేదముల నతిక్రమించిన యామె హృదయమెంత విశాలమైనదో విపులముగ వర్ణించినది.

ఎంత విశాలహృదయులకును దుర్నీతిపరులనుజూచిన ఏవగింపుండకమానదు. ఆమెప్రేమ యీ సీమలనుగూడగడచి 'పతితపావని' యన్న బిరుదము నామెకు సార్థకముచేసినది.

ఒక యువకుఁడు దుష్ప్రవర్తన కలవాటుపడెను. ఆతనిని దగ్గరకు రానీయవలదని పరిజనులు నివేదించుకొనిరి. ఆమె యంగీకరింపలేదు. "ఎంతమాట! ఆటలో ధూళి ధూసరితమైన బిడ్డ నిల్లు వెళ్లగొట్టుదుమా? నాబిడ్డ నాకు చేదా?" అని యామె సమాధానము. ఇంకొకప్పుడు ఒక జవ్వని యామెకడకువచ్చి యరమరలులేకుండ తానుచేసిన పాపములన్నియు పూసగ్రుచ్చినట్లు చెప్పివైచినది. "నీకేమియు భయములేదని యా పతితురాలి కభయహస్తమిచ్చుటయేగాక ఉపదేశప్రదానముకూడ చేసినది.

క్రూరులు దారిదోపిడిగాండ్రునని జనులు భయపడుకొందరు మహమ్మదీయు లొకప్పు డామె కుటీరము బాగు

చేయుటకువచ్చిరి. మాతృదేవి కీ సిబ్బంది యెక్కడ దొర కినదని యూరివారు భయపడసాగిరి. క్రమముగ నా దోపిడి గాండ్రు భక్తులుగ మారిపోయిరి. అందొకప్పు డొకడు దేవునికి నైవేద్యము పెట్టుమని కొన్ని యరటిపండ్లను దెచ్చి తల్లికిచ్చెను. "ఈ యరటిపండ్లీతని కెట్లువచ్చినవో" యని యామెను నైవేద్యము పెట్టకుండ వారింపజూచిరి. "ఎవరు మంచివారో ఎవరు చెడ్డవారో నాకు తెలియును." అని నిశ్శంకముగ నామె వానిని భగవానునికి నివేదన గావిం చెను. ఈ మహమ్మదీయులలో 'అమ్జేదు' అనియొక్క నాయకుడుండెను. ఆతని కలవాటుపడిన యొక వ్యభిచారిణి, "రాత్రి తలుపుదీసియుంచెదను. వచ్చి నాభర్తను వధింపు" మని యాహ్వానించెను. ఆ రాత్రి యనుకొన్న ప్రకార మామె యింటికిబోయెనుగాని యామె భర్తను వధించుటకు నిరాక రించి యామె చెవులనున్న దుద్దులను బలాత్కారముగ త్రెంచుకొనివచ్చెను. ఈ సాహసికుడు మాతృదేవి యను గ్రహమునకు పాత్రుడైనవెనుకగూడ నడుమనడుమ వెను కటి సంస్కారము ననుసరించి దొంగతనములు చేయువాడు. అయినను మాతృదేవి యాతనియెడ తన యనురాగమును వర్షించుట మానలేదు. ఒకపూట ఆతడాశ్రమమునకు వచ్చెను. మహమ్మదీయుడను నేవగింపుచే నామె మేనకోడ లయిన నళిని దూరమునుండి పదార్థములను విస్తరిలోనికి విసరుచుండెను. "అయ్యయ్యో! అట్లయినచో నీవుపెట్టిన తిండి యాతని కేమి సహించును?" అని మాతృదేవి స్వాయ

ముగ వడ్డించుటతో నాగక యాతని యెంగిలివి స్తరినిదీసెను. "అత్తా! నిన్ను వెలివేయరా" యని నళిని ప్రశ్నింపగ "వెఱ్ఱిదానా నాకు శరత్ (శారదానందుడు) ఒకటియు ఈ 'అమ్‌జేదు' ఒకటియునా?" అని యామె సమాధానము చెప్పినది.

1904–5 ఆ ప్రాంతములలో కలకత్తాలో బాగ్ బజారువీధిని అద్దెకు బుచ్చుకున్న మేడలో మాతృదేవి వసించుచుండెను. దీని యడుగుభాగమున శారదానందుడును మరి కొందరు పరిజనులును వసించుచుండిరి. 'బినోద్‌బిహారిసోమ్' అనువ్యక్తి అర్ధరాత్రమున నీ సౌధము ప్రక్కనుండిపోవుట వాడుక. ఈతడు మాష్టరు మహాశయుడను వ్యవహార నామముగల మహేంద్రనాధగుప్తుని విద్యార్థియగుటచే వారి కృపాతిశయమున శ్రీరామకృష్ణులను దర్శించు భాగ్యము కూడబడసెను. కాని తరువాత నొక నాటకసమాజమున చేరుటచే త్రాగు డలవాటయినది. ఈతనిని 'పద్మవినోదు' డను వినోదనామముతో స్నేహితులు వ్యవహరించుచుండిరి. శారదానందులతో నీతనికి గాఢపరిచయముండుటచే నాతనిని 'దోస్తు' (చెలికాడు) అని పిలచుచుండెను. తప్పత్రాగి యర్ధరాత్రమున నాటకశాలనుండి యింటికిపోవు సమయమున నీతడు శారదానందుని తలుపుతట్టువాడు. ఈతడు త్రాగియున్నాడని కనిపెట్టి శారదానందుని యాజ్ఞ ననుసరించి అచ్చటివారు తలుపుతీయకుండిరి. ఈ తీరున నొకనాడు పిలచుచు పిలచుచు ఎవ్వరును తలుపుతీయకపోగా త్రాగుడు

మైకముచేతనే అతడొక బంగాళీకీర్తనపాడెను. దాని భావ మిది—"తల్లీ! ప్రసన్నురాలవయి లేచి తలుపుతీయుము. ఈ చిమ్మచీకటిలో నా కన్నుల నంధకారమలముకొన్నది. నా గుండె దడదడగొట్టుకొనుచున్నది. గొంతు చించుకొని నిన్ను పదేపదే పిలుచుచున్నాను. నీవు దయామయివని ప్రసిద్ధి. కాని యీ దినమున నింత విపరీతముగ వర్తించు చున్నావేమి? కన్నబిడ్డ నీయంధకారమునవిడచి నీవు లోపల సుఖముగ నిద్రించుచున్నావా? 'తల్లీ! తల్లీ!' యని పిలుచుచు నేను శల్యావశిష్టుడనుగానా! ఎంత పిలచినను నీకు కరుణ రాదేమి? నే నాటలలో నిమగ్నుడనైతినని కోపమా? ఇంక ఆటలకే పోను. కరుణాస్వరూపిణీ! తలుపు తెఱవుము. నీవు తప్ప ఈ అధమాధముని భారము వహింపగలవారు మరెవ్వరు?"

ఈ పాట చెవినిబడగానే మాతృదేవి తటాలున లేచి వచ్చి తన మేడకిటికీ తెరచెను. అదిచూచి పద్మవినోదు డానందముపట్టజాలక "తల్లీ! లేచితివా? నీకీ దీనునిపై కృపవచ్చినదా?" అని తాను నిలచిన వీధిలోనే సాష్టాంగ పడి భూమిపై పొరలుచు నచటి ధూళిని శిరస్సున నద్దు కొనుచు నీ క్రిందితీరున పాడుకొనుచు వెడలిపోయెను.

"మనసా! శ్యామలవర్ణముగల తల్లిని నీ యంత రాళమున నతి జాగరూకతతో దాచికొనుము. నీవును నేనునుమాత్రమే ఆమెను దర్శించుకొందము. ఇంకెవ్వరును ఆమెను దర్శింపరాదు. నా 'దోస్తు'కూడ ఆమెను దర్శింప

రాదు. తరువాత నాతని సంగతి నంతను విచారించి తెలిసి కొని "చూచితిరా! ఆతని విశ్వాసమెంత దృఢమైనదో!" అని యామె పలికెను. అట్టి వేళగానివేళ నామె నిద్రా భంగముచేసికొని లేచుట బాగులేదని యామె పరిజనులు వాదింపగ "ఆ పిలుపునకు నేను తట్టుకొనజాలకపోతిని." అని యామె సమాధానమిచ్చెను. ఇట్లు మరియొక తరుణమున గూడ జరిగెను.

అచిరకాలముననే యాతనికి పాండురోగమువచ్చి యాసుపత్రిలో మరణమాసన్నమాయెను. అప్పుడు శ్రీరామ కృష్ణకథామృతమును దెప్పించుకొని వినుచు ఆనందబాష్ప ములతో ప్రాణములు విడచెను. ఈ సంగతి మాతృదేవి విని, "ఆశ్చర్యమేమున్నది! పరమహంసపుత్త్రుడు కాదా ఆతడు? నడుమ కొన్నాళ్లు బురదలో చిక్కుకొన్నను మరల గురుదేవుని యంకసీమ చేరుకొన్నాడు." అని పలికెను. శారదాదేవి పతితపావనశీలమును మాతృభావమును నిరూ పించుట కీయుదంతమొక యుత్తమ నిదర్శనము. (Prabuddha Bharata March, 1954. Two strange devotees by Swami Gambhirananda.)

ఒక్క మానవులపట్లనేగాక పశుపక్ష్యాదులపట్లగూడ నామె సమదృష్టితో ప్రేమజూపెడిది. పిల్లినికూడ నెవ్వరును కాలితోతన్నుట కంగీకరించెడిదిగాదు. ఒకానొకప్పుడొకడు తెలియక పిల్లితలమీద కాలుపెట్టి వినోదించుచుండగ "తల యనునది గురుస్థానము. అట్లు తన్నుటతప్పు."

అని యామె మందలించినది. తన యాశ్రమములోనున్న యొక మగచందనపక్షి యదేపనిగ గూయుచుండుటచూచి, "నాయనా! నీ కాకలివేయుచున్నదా?" అని యెంతో దయార్ద్ర హృదయముతో దాని కాహారము తెచ్చి పెట్టెడిది.

ఇంత యగాధమైన - అపారమైన దివ్యప్రేమము సరస్వతీప్రవాహామువలె నిప్పుడు తిరోహితమైనదా? అసంభవము. త్రిభువనములను పావనముచేయు గంగాభవానివలె నది యీనాడుకూడ ప్రవహించుచునేయున్నది. శ్రద్ధాళువు లయినవారు దానిలో నీనాడుకూడ స్నానముచేయుటకు సమర్థులగుచున్నారు.

## 19. ఉపదేశప్రదానము

మనలో నొక చిన్న కథ వాడుకలో నున్నది. రాజసూయ యాగము చేసినపుడు ధర్మరాజు కోట్టు పెత్తనము దుర్యోధనుని కిచ్చినాడట. దుర్యోధనుని చేతిలో స్వర్ణవేది యున్నదట. అందుచే నాతడు మంటి బెడ్డ తీసి యిచ్చినను అది బంగారము కావలసినదే. వచ్చిన రాజు లందరకు కానుకల మీద కానుకలిచ్చినను ధర్మరాజు సంపద తరుగకుండుట కిదే కారణమట!

మానవజాతి చరిత్రమున నెన్నడును కని విని యెరుగని కఠోర సాధన లాచరించి శ్రీ రామకృష్ణుడు గొప్ప

యధ్యాత్మిక సంపద గూడబెట్టినాడు. రాత్సుచైల్డులు, రాక్ ఫెల్లరు, ఫోర్డు, నఫీల్డు (Nuffield) మున్నగువారి సంపదలు దీని ముందు తృణప్రాయములు. అట్టి సంపదను లోకమునకు బంచి పెట్టుటకయి యాతడు మాతృదేవిని నియోగించినాడు. పరమహంస ఖజానాలో మాణిక్యము తప్ప మరియొక వస్తువుండదు గదా! మంటిబెడ్డలను సహితము మాణిక్యములుగా మార్చ గలిగిన మాతృదేవి హస్తమున మాణిక్యము లెట్లు పరిణమించినవో ఎవరు చెప్పగలరు?

అమోఘములైన అమూల్యములైన సూత్రముల నెన్నిటినో శ్రీ రామకృష్ణుడు కనుగొన్నాడు. హోమియోపతి సిద్ధాంతమునకు పితామహుడైన "హానిమన్" ఓషధులను తనమీద ప్రయోగించుకొని వాని గుణములను పరిశీలించి నట్లు అతడీ మంత్రముల నన్నిటిని యనుభవరూఢ మొనర్చు కొన్నాడు. మానవ జాతి హితమును గోరి వానిని సత్ప్రయోగముగ శారదాదేవి వశమున నుంచినాడు. రామకృష్ణుని శిష్యులు సయితము—తాము లోకాతీతవ్యక్తులే యయ్యును స్వతంత్రముగ నుపదేశ మిచ్చుట కధికారమున్న వారయ్యును ఉపదేశము నిమిత్తము తమయొద్దకు వచ్చిన వ్యక్తులను తరచు మాతృదేవి కడకు బంపుచుండువారు. "మనము జీర్ణించుకొన లేని కాలకూట విష మామెకడకు బంపుచున్నాము." అని యీ సందర్భమున ప్రేమానంద స్వామి పలుకువారట!

ఉపదేశ ప్రాముఖ్యమును నవీనులు గ్రహించుట చాల కష్టము. కాని యది గ్రాహ్యము కాకున్నచో మాతృదేవి మాహాత్మ్య మగమ్యము. ఉపదేశమనగానే గద్దెల నెక్కి కూర్చుండి శిష్యులు తెచ్చి యిచ్చునమూల్య ధనరాసులను చిరునవ్వుతో స్వీకరించుచు వారిచే సమస్తో పచారములు చేయించుకొనుచు ఉన్నవో లేవో ఎవ్వరును స్పష్టముగ నిరూపింప జాలని దివ్యలోకములను వారి కను గ్రహించు నెపమున సంచరించు లోకవంచకులు స్మరణకు వత్తురు. మత గురువు లందరును ఇట్టివారే కారు. కాని యిట్టివారే యని నవీనుల యపోహ.

ఆకలిచే బాధ పడుచున్నవారి కన్నదానము చేసిన వారిని ఘనులుగ కొనియాడుదుము. రోగముచే మూల్గు చున్నవారి కాసుపత్రులు నిర్మించినవారి నంత కంటెను మహామహులుగ నెంచి పూజింతుము. కాని యాధ్యాత్మిక మగు నాకలిని దీర్చి రోగముల కన్నిటికిని మూలకందమగు భవరోగమును నివారింప జేయు నుత్తమ పురుషులను మాత్రము లోకవంచకులుగ లెక్క వేయుచున్నాము. మత గురువులలో నెవ్వరో కొందరు దొంగ లున్నంత మాత్రమున నందరును దొంగలే యగుదురా? మానవజాతి నుద్ధరించి వారిని జెప్పవలసి వచ్చినపుడు బుద్ధభగవానుడు మున్నగు భవరోగ భిషజ్ఞులగు మతగురువులనే ప్రప్రథములుగ గణింప వలసియుండును. తక్కిన వారందరును వారి తరు వాత జెప్పవలసినవారే. మాతృదేవి కూడ అట్టి యగ్ర

శ్రేణికే చెందును. దుర్గతులపాలయి తపించు నధమాధమ జీవులయెడ నీమె వర్షించిన ప్రేమ నవీన యుగచరిత్రమునకు మకుటము కాదగియున్నది.

శ్రీ రామకృష్ణు డామెను గూర్చి "ఈమె సరస్వతీ దేవి యవతారము. బ్రహ్మజ్ఞానదాత్రి" అని ప్రశంసించు వాడు. ఈ క్రింది యుదంతము వివేకానందస్వామి యంతటి వాడు ఆమె గురుభావము నెంతగ గౌని యాడుచుండినదియు విశదము చేయును.

వివేకానందుడు పశ్చిమ ఖండము నుండి వచ్చిన వెనుక సురేంద్ర కుమారసేనుడను భక్తు డాతనిని ఉపదేశము నిమిత్తము మిక్కిలి శ్రద్ధాళువై వేడుకొనుచుండెను. ఒక నాడు కొందరి కుపదేశ మిచ్చిన వెనుక నాతనిని బిలచి, "నేను నీ కుపదేశ మీయదలచి ధ్యానములో గూర్చుంటిని. ఠాకూరు (పరమహంస) ప్రత్యక్షమయి నాకంటె నెన్నియో రెట్లు గొప్పదైన వ్యక్తి నీ కుపదేశ మీయగల దనియు ఆ పనికి నేను నిర్ణీతు డను కాలేదనియు చెప్పినాడు. అందుచే నిరుత్సాహివి గాక వేచియుండుము" అని బుజ్జగించెను. ఉపదేశమునకు తాను తగనని మోటుగ నిరాకరించుట కిష్టము లేక స్వామి యిట్లు చెప్పెనని యా భక్తు డనుమానించెను.

కొంతకాలమయిన పిమ్మట 'భోలా' యను ప్రదేశమున నాతడు పని చేయుచుండగ నొకనాడు కలలో నొక దేవతా మూర్తి యాతనికి బ్రత్యక్షమయి, "నేను సరస్వతిని.

నీ కుపదేశ మిచ్చెదను రమ్ము" అని మంత్రము నను గ్రహించెను. ఈ మంత్రమువలన ప్రయోజన మేమి యని యాతడు ప్రశ్నింపగ "దీనిని జపియించిన-చో నీవు కవి వగుదువు." అని యామె బదులు పలికెను. "కవులన్న నాకు తల నొప్పి కవియగుట యిష్టము లేదు." అని యాతడు పలుకగ "కవి యనగా నర్థ మేమో తెలియునా? సత్యద్రష్ట యనిన మాట." అని బోధించి జపమాల నెట్లుపయోగింపవలెనో చెప్పి 108 సార్లు మంత్రము జపించుకొమ్మని యామె యంతర్ధాన మాయెను.

మరి కొంతకాల మయిన పిమ్మట ఈ స్వప్నమును గూర్చి వివేకానందునితో బ్రసంగింపగా "దీనినే స్వప్నసిద్ధి యందురు. స్వప్నములలో గూడ దేవతలు ప్రత్యక్ష మయి మంత్రము లనుగ్రహించుట కలదని శ్రీ రామకృష్ణులు చెప్పువారు. ఆ మంత్రము తప్పక జపించుకొనుము" అని వివేకానందులు హెచ్చరించిరి. "నాకు స్వప్నములలో నమ్మకము లేదు. మెలకువగ నున్నపుడు మన మనుకొనుచుండునవియే స్వప్నములో సాక్షాత్కరించును." అని యా శిష్యుడు నిరాకరించెను. "ఈ పిచ్చిమాటలు కట్టిపెట్టు. ఆ స్వప్నము మిక్కిలి యథార్థమైనది. ఆ దేవత బగళ. ఆమె యిప్పుడు సరస్వతీదేవి యవతారముగ బ్రత్యక్షమగుచున్నది. పైకి ప్రశాంత స్వరూపిణి యయ్యును నాంతర్యమున ప్రచండ శక్తినిలయ. ఆ మంత్రమును తప్పక జపించు కొనుము. ఆధ్యాత్మికముగ నది నీకు మేలు

చేయును.'' అని స్వామి యెంత యుపదేశించినను వినిపించు కొనక అత డా మంత్రము నొక్క దినమైనను జపింపలేదు. ఇంతకంటె విచిత్ర మేమి యుండును? మంత్రదీక్ష కయి ప్రయత్నించుచున్నవాడు వివేకానందుని యందు గుఱియున్న వాడు ఆతని మాట విశ్వసింపకుండ నున్నాడు! భగవంతుని మాయ ఎవరి కర్థమగును?

ఈ తీరుగ తొమ్మిది సంవత్సరములు గడచినవి. 1901 లో దుర్గాపూజకు బేలూరు మఠము పోయి అక్కడ నుండి కమార్‌పుకూర్ మీదుగా నతడు జయరామవటి చేరుకొనెను. అక్కడ నాలుగైదు రోజులున్న పిమ్మట మాతృదేవి యొకసారి అతనిని చెంతకు బిలచి ''నా యొద్ద నుండి ఏమి గైకొందువు?'' అని యడిగెను. ''నా కేమియు నర్థమగుట లేదు.'' అని యాతడు తెల్లబోవుచుండగా ''నీకు వాంచితార్థము లీయ గల శక్తి నా కడ నున్నది.'' అని యామె బుజ్జగింపగ ''నట్లయినచో నా కేది హితకరమో దాని ననుగ్రహింపుము'' అని యాతడు ప్రార్థించెను.

ఆమె యాజ్ఞ ననుసరించి మరునా డుదయమున పూజా సమయమున నాతడు కొన్ని పుష్పములు దీసికొని ఆమె కడకు బోయెను. ఒక చేయి నాతని శిరస్సు పైనుంచి రెండవ చేతితో నాతని గడ్డము పట్టుకొని యామె మంత్రోపదేశము చేయగా నాతనికి బాహ్యస్పృహ తప్పిపోయి లోపల నపారమయిన యానంద ముదయించెను. వెనుకటి

స్వప్నము మరల జ్ఞప్తికి వచ్చెను. ఆ స్వప్నమున సాక్షాత్కరించిన దేవతా మూర్తి విగ్రహము సరిగా మాతృదేవి విగ్రహము వలెనే యుండెనని యాతనికి స్ఫురణకు వచ్చెను. అప్పుడు స్వప్నములో తన కిచ్చిన మంత్రమును ఇప్పు డిచ్చిన మంత్రమును సరిగా నొక్కటే. ఆశ్చర్యము, భక్తి, వినయము అతని మనస్సున ముప్పిరి గొని యల్ల కల్లోల పరుప సాగెను.

శిష్యులు వ్రాసిపెట్టిన యిట్టి యనుభవము లెన్నయిన నున్నవి. పై యుదంతమున గమనింప దగిన ముఖ్యాంశము లలో నొకటి మంత్రదీక్ష నిచ్చు నధికారమున ఆమెను తన కంటె నెన్నియో మడుగులు గొప్పదానినిగ వివేకానందుడు పేర్కొనుట. నిజముగ నుపదేశప్రదానమున నామె కామె యేసాటి. విశేషముగ పరీక్షించికాని పరమహంస యుపదేశమిచ్చువాడు కాడు. దేవియన్ననో ధర్మసత్రము. అడుగనివారిది పాపముగ నామె యుపదేశమిచ్చినది. ఆమెవలన నుపదేశము గైకొన్నవారు కొన్నివేలయిన నుందురు. 'అమ్మా!' యని చేయిచాపగనే యామె లేదనలేక పోయెడిది. ఆమె యుపదేశమిచ్చుటకు నిరాకరించిన వారి సంఖ్య మొత్తముమీద పదిపండ్రెండుగురికంటె నెక్కుడుండదు. వీరికయినను ప్రబలకారణములుండుటచే నిరాకరింపవలసి వచ్చినది.

ఉపదేశమనగా నేదో యొక నామమును చెవిలో నూదుటయే గదా! దీనిలో ఘనతయేమున్నది. అని

యాక్షేపించువారుండక పోరు. కాని యుపదేశమనగ నంత తేలికపనిగాదు. శిష్యునికే తెలియని యాధ్యాత్మికలోపము లను గురువు గ్రహించుటకు శక్తుడయియుండవలెను. శిష్యుని పాపములనన్నిటిని వ్యాధిరూపముగ గురు వనుభవింపవలెను. అత్యంతపరిశుద్ధచరిత్రయగు నామె తుదిఘడియవరకు నేదో యొక రోగముచే బాధపడుచునేయుండెడిది. ఈ వ్యాధు లన్నియు నుపదేశము పుచ్చుకొన్న శిష్యు లనుగ్రహించినవే! శిష్యుని నిమిత్తమయి జీవితమంతయు చిత్రవధచేయించుకొన జాలిన వ్యక్తులే ఉపదేశప్రదానమున కధికారులనిన నుప దేశమిచ్చుట యనగ నెంత బాధ్యతతోగూడిన వ్యాపా రమో సువ్యక్తమగును. ఆమె బాధలనుచూచి సహింపలేక "అమ్మ యింక నుపదేశమీయకుండ జూడవలెను." అని శారదానందుడు మున్నగు ననుచరులు ఆమెకడ కెవ్వరిని బోనీయకుండ నాపివేయుచుండువారు. కాని వారి ప్రయత్న ముల నామె సాగనిచ్చెడిదిగాదు. "రామకృష్ణుడు రస గుల్లాలు (ఒకరకమయిన బంగాళీమిఠాయి) తినుట కవత రించెననుకొంటిరా?" అని యామె మందలించెడిది. పాప ములుచేసినవారు ఆమె పాదములు స్పృశింపగనే భగ్గుభగ్గున పాదములు మండిపోయెడివి. పదేపదే గంగాజలముతో క్షాళనముచేసికొన్నను ఆ మంట శాంతించెడిది కాదు. ఇది తెలిసి మైసూరు గవర్నమెంటులో నొక యున్నతోద్యోగి యామెను దర్శింపవచ్చినపుడు (శ్రీమాన్ నారాయణ అయ్యంగారు) ఆమె పాదములను స్పృశించుటకు జంకు

చుండగ ఆమె యెంతో లాలనగ "రా! నాయనా! రా" సంశయింపకుము. మా పుట్టుకకు మరి ప్రయోజనమేము న్నది? అని యాహ్వానించెను.

శిష్యులచే నుపచారము చేయించుకొనుటకు మా రామె శిష్యులకే యుపచారముచేసెడిది. దీనినిగూర్చి కొంత వెనుకటి యధ్యాయములోనున్నది. ఒకప్పుడొక శిష్యుడు గజ్జిచే నన్నము తినలేక యవస్థలోనుండగ గజ్జి నయమగువరకు తాను స్వయముగ నాతని కన్నముకలిపి నోటిలోనుంచెడిది. ఒక శిష్యురాలిబిడ్డ తివాసీమీద పాడు చేయగ మాతృదేవి స్వయముగ నాతివాసి శుభ్రపరచినది. ఇంచుమించుగ నామెచే సేవచేయించుకొనని శిష్యుడు లేనే లేడని చెప్పవచ్చును. దీనిని మహాపచారముగ నెంచి శిష్యులు బాధపడగ "నేను మీ తల్లినిగానా?" పెద్దవారయిన వెనుక వచ్చినారుగాన మీరింత బిడియపడుచున్నారుగాని ఇదే పసి పిల్లలుగ నాకడ కరుదెంచినచో మలమూత్రములుదీసి బాగు చేయవలసినదాననుగానా?" అని బ్రతిమాలుకొనియెడిది. ఆమె శిష్యులందరు నేకగ్రీవముగ "కన్నతల్లియైన మమ్మింత గారాబముతో బెంచలేదు." అని యుద్ఘోషించుచున్నారు.

పరమహంస హృదయమున శిష్యులపై నెంత యగాధప్రేమయున్నను పైకి కాఠిన్యము వహించి తాను చెప్పిన నియమము ఉల్లంఘించుట కంగీకరించువాడు కాడు. మాతృదేవి యట్లుగాక భోజనాదికములలో నియమములను త్రోసిరాజని గారాబముతో పెంచెడిది. ఒక యుదాహర

ణము వెనుకటి యధ్యాయములలో నొకచోటనున్నది. ఈ సందర్భమున మరియొక యుదాహృతి నిచ్చుట యనుచితము గానేరదు. అసుతోష్ మైత్రయను పరిజనుడు గ్రహణిసోకి బాధపడుచుండెను. ఆతని మేలుగోరి వైద్యుడు చెప్పిన ప్రకారము శారదానందస్వామి సగ్గుబియ్యపు జావ, పాలు ఇచ్చుచుండెను. కాని యిది రోగికి రుచింపకుండెను. మాతృదేవి యెవ్వరికిని తెలియకుండ రసగుల్లాలు మిఠాయి తెచ్చి యా రోగికి బెట్టుచుండెను. సాధారణవ్యక్తులలో నిది యవివేకమేయగును. కాని మాతృప్రేమయనగ నిట్టిదియని నిరూపించుటకు ఆమె యీ యవివేకమునకుగూడ నొడబడియెడిది. ఇది మనస్సులో నుంచుకొనియే కాబోలును విజ్ఞానానందస్వామి "పరమహంస హృదయముకంటె మాతృదేవి హృదయము నవనీతమయము. ఆమె నాశ్రయించి నచో త్వరగ కృతార్థులము కాగలుగుదుము." (విజ్ఞానానందస్వామి సంభాషణములు) అని హెచ్చరించెను.

ఆమె యుపదేశమిచ్చుపద్ధతిగూడ విశిష్టమైనది. "మాతృదేవి అయిదు నిమిషములలో నుపదేశమిచ్చునే. మీరందరును అరగంట, గంటవరకు తీసికొందురేల?" అని యొకరు శారదానందులను బ్రశ్నింపగ "మేము భగవానుని బ్రత్యక్షముచేసికొని అతడు మిమ్ముంగీకరించునట్లు చేయుటకెంతకాలముపట్టును. మాతృదేవి సంకల్పమాత్రముననే యది నిర్వహింపగలదు." అని వారు సమాధానమిచ్చిరట. ఉపదేశము నిమిత్తము శిష్యుడు బయలుదేరినాడనగనే –

ఎవ్వరును చెప్పకుండగనే – ఆమెకు తెలిసెడిది. సాధారణ ముగ వారివారి యిష్టముల ననుసరించియే ఆమె మంత్రము ననుగ్రహించెడిదిగాని ఒక్కొక్కప్పుడు వారి యిష్టదైవ మును మార్చి వేరొకమంత్ర మిచ్చుటకూడ కలదు. తరు వాత తరువాత ననుభవమునుబట్టి యామెచేసిన మార్పు వివేకసమన్వితమయినదని యా శిష్యులు గ్రహించుకొనగల్గెడి వారు. పూజామందిరమున స్నానాదికములయిన తరువాత యథావిధిగ నుపదేశమిచ్చుటయే సర్వత్ర నామె యాచా రముకాదు. ఒకప్పుడు కలకత్తాపోవుటకయి విష్ణుపురమను స్టేషనులో నామె వేచియుండెను. ఒక 'లైసెన్సుకూలీ' ఆమెకడకు పరుగునవచ్చి, "అమ్మా! ఇన్నాళ్లుగ నీకయి తపించిపోవుచుంటిని. తల్లీ! నీవు సాక్షాత్తు జానకీదేవివి. ఇంతకాలమెందు దాగియుంటివి?" అని విలపింపజొచ్చెను. ఆతనిని శాంతింపజేసి సమీపముననున్న పూలచెట్టునుండి యొక పుష్పమునుదెచ్చి తన పాదములమీద వేయుమని చెప్పి, అతడట్లు పూజించినవెనుక ప్రదేశముగాని ప్రదేశ మున సమయముగాని సమయమున నాస్టేషనులో నాతని కుపదేశమిచ్చెను. బహుశః కలలోగాని మరియొక తీరున గాని అంతకుపూర్వ మాకూలివాని కేదో దివ్యానుభూతి లభించి యుండవలెను. ఇట్లే తటస్థించినచోటనెల్ల నామె యుపదేశ మిచ్చెననుట కుదాహృతులీయవచ్చును.

ఉపదేశము పుచ్చుకొనుటలోనున్న యుబలాటము కొందరికి తరువాత ననుష్ఠానములో నుండదు. అట్టి యశ్రద్ధ

చేయు శిష్యులనిమిత్త మామె వారికి బదులుగ జపము చేయుచుండెడిది. రోజునకు లక్షకు తక్కువకాకుండ జపము చేసెడిదని యొకరు వ్రాయుచున్నారు.

ఆమె యిచ్చిన మంత్రమును జపించుటవలన ప్రత్యక్ష లాభ మేమైననున్నదా? ఐహికముగ ధనధాన్యములు గృహారామములు ఎవరికైన సిద్ధించినవో లేవో నిర్ణయించుట కష్టసాధ్యము. కాని యిహయాత్రలో తటస్థించు కష్టముల నెదుర్కొని పోరాడజాలిన మనోబలమును, మనస్సు నున్నతభూములకు గొనిపోజాలిన యాధ్యాత్మికశక్తి వికాసములును సిద్ధించెడివని యామె శిష్యులు ఘంటాపథముగ వ్రాయుచున్నారు. ఇది యెంత యమూల్యమయిన వరప్రదానము!

1954 మార్చినెల ప్రబుద్ధభారతి పత్రికలో ఇప్పుడు సజీవులై యున్న అపూర్వానందులను నామె శిష్యులు "Mother's Grace" "మాతృదేవి యనుగ్రహము" అను శీర్షికతో నొక వ్యాసమును బ్రకటించినారు. అది చదివినచో మాతృదేవి యుపదేశప్రదానమందలి వైశిష్ట్యము సువ్యక్తమగును. మొదట కొన్నిదినము లెంత ప్రయత్నించినను వీరికి మాతృదేవి దర్శనమే దొరకలేదట. తురీయానందులను రామకృష్ణ శిష్యులతో నీ యంశమునుగూర్చి వీరు ముచ్చటింపగ "నీ హృదయమునందలి తహతహ గాఢమొనర్చుటకయి ఆమె యట్లు చేయుచుండవచ్చును." అని వారు సమాధానమిచ్చిరట. మాతృదేవి దర్శనమే దుర్లభ

మాయెనే యను దీర్ఘవిచారముతో నొంటిగ గూర్చుండగ భౌతికదర్శనమునకు ముందామె దివ్యదర్శనము లభించిన దట! ఎంత యదృష్టవంతుడో! తరువాత నామెను దర్శింప బోయినపుడు ముఖమును ముసుగుతో నాచ్ఛాదించుకొని ఏమియు మాటాడకుండ తక్కినవారి కామె దర్శనమిచ్చు చుండుటచూచి ఆమె యెట్లయినను ముఖముపై నున్న యాచ్ఛాదనమును తొలగించుకొని తనతో మాట్లాడవలె నని యాతడు మనస్సులో గోరుచుండెనట. తీర తనవంతు వచ్చుసరికి ఆమె పాదములకు మ్రొక్కి పైకిచూచును గదా! ఆమె తన యాచ్ఛాదనమును తొలగించుకొని "బిడ్డా! నీవు ప్రసాదము తీసికొన్నావా?" అని ప్రశ్నించినదట. అంతతో నూరకుండక "నీ మనోభీష్టము నెరవేరినదా?" అనికూడ ప్రశ్నించెనట. మరికొన్నాళ్లయిన పిమ్మట నామెకడ నుప దేశము గైకొనుసమయమున మంత్రమునిచ్చి "అదిగో! నీ యిష్టదైవము" అని యామె పలుకుసరికి వారి యిష్టదైవము దివ్యమూర్తితో సాక్షాత్కరించెనట. ఇట్టి యనుభవముల నెన్నిటినైన చేర్కొనవచ్చునుగాని గ్రంథము విస్తృత మగును.

రామకృష్ణులు పరమపదించిన క్రొత్తలో నీమె స్త్రీ గనుక స్త్రీ లీమె ఘనతను గోరంతలు కొండంతలు చేసి కొనియాడుచున్నారను నభిప్రాయము కొందఱికుండెను. అట్టి యభిప్రాయమున్నవారిలో గిరీశచంద్రఘోషొకడు. ఇతడు ఎంత ధీమంతుడో యంత డిప్పకాయయనికూడ జగద్విది

తము గదా! ఒకనాడు నిరంజనానందస్వామితో గలసి యాతడు మాతృదేవిని దర్శింపవచ్చెను. అదియే యాతని ప్రథమదర్శనము. దూరమునుండియే ఆమె మూర్తినిజూచి గిరుక్కున వెనుకకుదిరిగి యొక్కడును నా ప్రదేశముననే కొంతదూరమున ధ్యానపరుడై గూర్చుండెను. కొంతసేపటి కాతని విచిత్రవర్తనమును గుర్తించి నిరంజనానందు డాతనిని సమీపింపగ, నీవుపోయి మాతృదేవి నా పందొమ్మిదవయేట నాకు కలలో గనపడినదో లేదో కనుక్కొనిర"మ్మని వేడి కొనెనట. ఆమెను సమీపించి తిరిగివచ్చి నిరంజనానందులు కనబడితినని యామె యొప్పుకొన్నదని చెప్పగ గిరీశుడు, "అప్పుడు నేను తీవ్రమయిన వ్యాధిచే బాధపడుచుంటిని. మా వాండ్రందఱును నన్నుగూర్చి నిరాశచేసికొనిరి. అప్పు డొక దేవతామూర్తి నా కలలో గనవచ్చి 'పాపము చాల దారుణముగ బాధపడుచున్నావే' యని నన్నోదార్చి–పూరీ (జగన్నాథ) ప్రసాద మనుకొందును – నా నోటనుంచి యంత ర్ధానమాయెను. వ్యాధి వెంటనే మళ్లుమొగముపట్టి యనతి కాలములోనే నాకు పూర్ణారోగ్యము లభించినది." అని యాతడానందపారవశ్యమున కేరింతలు కొట్టసాగెను.

ఆమె శిష్యవాత్సల్యము నిరూపించుటకీ క్రిందియు దంతము మకుటాయమానము. ఒక సంవత్సర మామె బసలో దుర్గాపూజా దినములలో దుర్గాపూజకంగముగ సంధిపూజ జరుగుచుండెను. శిష్యబృంద మామె పాదముల నెట్టితామరలతో పూజించి వెడలిపోయిరి. ప్రక్కనున్నయొక్క

శిష్యవ్యక్తిని జీరి, యామె "ఇంకను తామరపూలు తెమ్ము. తెచ్చి నా పాదములపయినుంచుము. రఖల్, తారక్, శరత్, ఖోకా, గోలప్, యోగిన్ వీరందరిని పేర్కొనుచు నా పూలను నా పాదములకు బూజచేయుము. నాకు జ్ఞప్తి యున్నట్టియు లేనట్టియు శిష్యు లందఱిపక్షమునను బూజింపుము." అని ప్రోత్సహించెను.

ఇట్లు దివ్యభావమును వహించి యామె కోరుట మిక్కిలి యరుదు. ఆ శిష్యవ్యక్తి యామె యాజ్ఞ ననుసరింపగ నామె శ్రీరామకృష్ణుల పటమువంక దృష్టిబరపి - చేతులుమోడ్చి - నిశ్చలముగ ధ్యానించుచు, "స్వామీ! నా శిష్యులందరును ఇహపరముల రెండింటిని చూరగొను నట్లనుగ్రహింపుము." అని ప్రార్థించెను.

ఆ ప్రార్థనవలని ఫలితము ఒక్కనాటితో నిలచిపోవు నదికాదు గదా!

## 20. లోకహితము

మాతృదేవి మాహాత్మ్యము అగాధమైనది. ఆమె లోకమునకు మేలుచేసిన పద్ధతినిగూర్చి యాలోచించిన కొలది యాశ్చర్యనిమగ్నులము కావలసినదే. "బూడిదలో పొరలిన పిల్లివలె ఈమె తన మాహాత్మ్యమును దాచుకొనుచున్నది." అని శ్రీరామకృష్ణుడు తరచు ప్రకటించు చుండువాడు. "ఈ మేలుచేసినది" అని గు ర్తించుటకు వీలులేకుండ నామె లోకమున కుపకరించినది.

దీనిని 'మాతృపద్ధతి' యని నామకరణము చేయ వలసియున్నది. బిచ్చగాడువచ్చి వీధిలో నిలువబడి 'అమ్మా! బిచ్చ''మని యరచును. తల్లి స్వయముగా బిచ్చముతీసికొని రాదు. పెద్దమ్మాయిని బిలచి యామెచేత దోసెడు బియ్య ముంచి ''పోయి యా బిచ్చగానికిబెట్టి ర''మ్మనును. పైకి వచ్చి బియ్యముపెట్టినది పెద్దమ్మాయి. కాని లోపలనెవ్వరికి గానరాకుండ సేవచేయునదితల్లి. గృహయజమాని యింటికి రాగానే మరియొకపిల్లను బిలచి ఆతనికి కాళ్లు కడుగుకొను టకు నీళ్లు తుడుచుకొనుట కంగవస్త్రమును పంపును. అతిథి యింటికిరాగానే యాతనికి మంచితీర్థము, కాఫీ, ఫలాహారము మరియొక పిల్ల చేతనో పిల్లవానిచేతనో పంపును. ఇందరికిన్ని విధములసేవచేయుచున్నను తానుమాత్రము ప్రత్యక్షము కాదు—తన పేరుమాత్రము ప్రకాశింపనీయదు. తనది యని ప్రత్యేకముగ నేదియునుండరాదు. ఈ తీరున తన యహంకృతిని పూర్ణముగ నాశనముచేసికొనుచున్నది. పరి పూర్ణమైన యిట్టి నిరహంభావసేవకు ''మాతృపద్ధతి'' యని పేరు పెట్టుట యుచితముకానేరదా? పశ్చిమ ఖండమునుండి వచ్చినవెనుక వివేకానందు లొకప్పుడు యోగానందునితో తాను స్త్రీలకొరకయి ప్రత్యేకముగ మఠము నిర్మింతుననియు, దానికి మాతృదేవి నధ్యక్షురాలినిగ జేయుదుననియు చెప్పెను. వెంటనే యోగానందులు చేతులుజోడించుకొని ''ఏపనికైన నే నంగీకరింతునుగాని మాతృదేవిని నలుగురు నోళ్లలోను బడవైచుట కంగీకరింపను. ఆమెను రహస్య

ముగ నట్లుండనిమ్ము.'' అని వేడుకొనెను. "అదేమి యిట్లను చున్నావు'' అని వివేకానందులు ప్రశ్నింపగ "జనులు నన్ను అవతారపురుషునిగ గుర్తింపగనే నేను నిష్క్రమింతును.' అని గురుదేవుడు వచింపలేదా? తుదకట్లే జరిగినదికాదా? మాతృదేవిని మనలోకమునకు ప్రకాశింపజేయగనే ఆమె కూడ నట్లే నిష్క్రమించునేమోయని నాభయము.'' ఈ సమాధానమునకు మిక్కిలి మెచ్చుకొని, వివేకానందుడు, "మంత్రీ! బాగుగ జ్ఞప్తిచేసినావు. అవును నీవు చెప్పినది నిజమే.'' అని యంతతో మాతృదేవి నధ్యక్షురాలినిగా జేయవలెనన్న సంకల్పమును విరమించుకొనెను.

మాతృదేవి నెఱపిన - నెఱపుచున్న - లోకహిత మపారము. దానికి హద్దులు నిర్ణయించుట ఎవ్వరితరమును గాదు. కాని నీళ్లలో జాడలు తీసినట్లుగ నామె జగజ్జనహిత బుద్ధిని కొంతవరకయిన స్ఫురింపజేయుట యగత్యము.

1888 లో ఆమె గయకు తీర్థయాత్రకయి పోయి నపుడు అక్కడనున్న యొక మఠమును దర్శించెను. అక్కడి సన్న్యాసులు అన్నపానములకే కొదువయు లేకుండనాధ్యాత్మిక సాధన నెరవేర్చుకొనుటచూచి ఆమె మాతృహృదయము తల్లడిల్లిపోయెను. అప్పటికి పరమహంస ముఖ్యశిష్యులు పరివ్రాజకులయి తలదాచుకొనుటకు తావులేక యల్లాడు చుండిరి. "నాబిడ్డలకు గూడ నిట్టిమఠము ననుగ్రహింపవా?'' అని యామె భగవానుని ప్రార్థించినది. తత్ఫలితమే ప్రకృ తమునన్న బేలూరుమఠము. దాని శాఖోపశాఖలుగ

ప్రపంచమంతటను వెలసిన మతములన్నియు నామె యానాటి ప్రార్థనకు ఫలితములుగనే భావింపవచ్చును.

ఇప్పుడు రామకృష్ణమిషనువారు చేయుచున్న ప్రజాహితసేవ యామెకు మిక్కిలి సమ్మతము. జ్ఞానవ్యాప్తికయి విద్యాలయములు నిర్మించుట, రోగుల కాసుపత్రులు నిర్మించుట, వరదచే బాధపడుచున్నవారికి, తుపానుచే బాధపడుచున్నవారికి, కరవుపీడించుకొని తినువారికి తద్బాధా నివారణము గావింప యత్నించుట మున్నగు నుద్యమము లామెకెంతో హర్షప్రదములుగ నుండెను. 1912 లో మూడవసారి కాశీయాత్రకు బోయినపుడామె యచ్చటి రామకృష్ణ సేవాశ్రమమున జరగురోగులసేవకు మెచ్చుకొని యొక పది రూపాయల నోటును చందాగా బంపెను. మాతృదేవి హస్తములనుండి వచ్చిన యా నోటును మార్చక ఆశ్రమము వారిప్పటికిని దానిని పెట్టిలోబెట్టి భద్రపరచియున్నారు. అదియే వారిపాలిటి కామధేనువయి అనంత ధనరాసులను గురియుచున్నది. బాధానివారణార్థము పనిచేయు మిషను సభ్యులెవరైన కంటబడినచో వారు చేయుచున్న పనిని గూర్చి ఆమె గ్రుచ్చి ప్రశ్నించుచుండెడిదట.

వివేకానందుడు అమెరికాకు పోవుటకు ముందు రహస్యముగ నామె యాశీర్వాదమునుపొందెను. తన విజయమంతయు నా యాశీర్వాదఫలితమే యని యాతని దృఢవిశ్వాసము. ఒంటిగ విదేశములలో నెన్నెన్ని కష్టము లెదుర్కొనవలసి వచ్చినను మాతృదేవి దీవన యాతని కంగ

రక్షగ పనిచేసినది. బ్రహ్మానందస్వామి రామకృష్ణమఠముల కెల్ల ప్రథమాధ్యక్షుడు, పరమహంస మానసిక పుత్త్రుడు. ఆధ్యాత్మిక ప్రపంచమున పసిఫిక్ మహాసముద్రమువలె నున్న యాతని గాంభీర్యము అగాధమని రామకృష్ణుని శిష్యులే యభిప్రాయ పడుచుండిరి. అట్టి మహాధీరుడుగూడ మాతృదేవి సన్నిధిని పసిపిల్లవానివలె భావపూర్ణుడయి సంచరించు వాడట. విభూతిభూషణుడు చెప్పినాడు - తాను తరచు వసించు భువనేశ్వరమున కామెను రావలసినదిగ ప్రార్థింప వలెనని - కాశీలో నామె తీర్థయాత్ర చేయుచుండగ బ్రహ్మానందస్వామి మాతృదేవిని దర్శింపవచ్చినాడట—"అమ్మా! బువ్వ" యని పసిపిల్లలను నట్లుగ "అమ్మా! భువనేశ్వరము 'అమ్మా! భువనేశ్వరము' అని యస్పష్టవాక్యము నుచ్చరించునేగాని "అమ్మా! నీవు భువనేశ్వరము రావలసిన'దని పూర్ణ వాక్యమును బలుక లేదట! ఆధ్యాత్మిక విషయముల లోనేగాక ఉద్యమ నిర్వహణమునకు సంబంధించిన లౌకిక విషయములలోగూడ పరమహంస శిష్యులామె యాదేశము నర్థించి శిరసావహించువారు. రామకృష్ణమిషను మొదటి కార్యదర్శియయిన శారదానందులవంటి దక్షులు అరుదు గదా! తాను నిర్వహించు భారమంతయును మాతృదేవి సంకల్పించినచో నెంతటి సామాన్యవ్యక్తిచే నయిన నిర్వహింప జేయగలదని యాతని విశ్వాసమట! ప్రతిదినము ప్రాతఃకాలము వందననిమిత్తము మాతృదేవి సన్నిధికి రావలెననిన నాతడు ఎంతో భయభక్తులతో సమీపించువాడట.

నిర్వికల్పసమాధి యరచేతనున్న జగద్గురువులయిన ఇట్టి మహావ్యక్తులు ఆమెయెడ నింతటి భయభక్తులను ప్రకటించుట కామె గురుపత్నియను గౌరవమొక్కటే కారణమయి యుండనేరదు. వారు గ్రహించినంత గాఢముగ నామె మాహాత్మ్యమును గ్రహించుట కితరుల కవకాశము లేదు. బ్రహ్మాండములతో బంతులాడు బ్రహ్మాండనాయకివలె దిగ్దంతులవంటి యిట్టి శిష్యులను తన కనుసన్నల మెలగించుకొనుచు వారి ముఖమున లోకమున నొక నూతనశక్తి నామె సంచరింపజేసినది.

రామకృష్ణుడువచ్చి "బ్రహ్మకుండలిని"ని ప్రబుద్ధమొనర్చెనని వివేకానందుడు వ్రాక్రుచ్చినాడు. అనగా వ్యక్తులమూలాధార చక్రమున నిద్రాణమయియుండు 'కుండలిని' వలెనే విశ్వమున కంతకునుగూడ జననీమతల్లియై హితమాచరించు నొకకుండలినీశక్తి యుండుననియు నదివరలో నిద్రాణముగ నున్నయది రామకృష్ణులయాగమనమున ప్రబుద్ధమైనదనియు నాతని తాత్పర్యము. అట్లు ప్రబుద్ధమైన విశ్వకుండలినికి మాతృదేవిని ప్రత్యక్షస్వరూపముగ నెంచవచ్చును. ఆ శక్తి యిప్పటికిని విజృంభణ దశలోనుండి జగద్ధిత మాచరించుచున్నది.

## 21. కైలాసమునుండి కదలిరాదా?

ఒకదృష్టితో జూచినచో శారదా రామకృష్ణుల జీవితము కైలాసశిఖరము నధిరోహించుచున్నది. ఆధ్యాత్మిక

ముగగాని నైతికముగగాని వారి యౌన్నత్యము మానవ మాత్రుల కగమ్యముగ గనుపట్టును. పుణ్యాపాపముల నడుమను సుఖదుఃఖముల నడుమను తప్పటడుగులు వేయుచు దరిగానలేక కొట్టుకొనుచున్నది మానవలోకము. ఇంచుమించుగ కామముగాని లోభముగాని మరియే యితర దుర్గుణముగాని ఎన్నడును స్పృశించి యెరుగని స్వచ్ఛమైన వెండికొండ వారి జీవితము. ఈ రెండింటికిని సమావేశ మెక్కడ ?

ఈ పుణ్యదంపతులు మాత్రమేగాక వారి సన్నిహిత వర్తులుకూడ మనకెంతో దూరముననున్నట్లు గనవచ్చుచున్నది. శారదాదేవిని గైకొన్నచో పురుషులలో యోగానందస్వామి, శారదానందస్వామి మున్నగు మహోన్నత చరిత్రులును, స్త్రీలలో గోలప్‌మా, గౌరీమా అను పరమ పరిశుద్ధ హృదయలును ఆమె యాంతరంగిక వర్గముగను నిత్యసన్నిహిత వర్తులుగను ఎన్నదగినవారు. కైలాస శిఖర మొక్కటేగాక దాని సానువులుగూడ మనకు తేరిచూడరానివైనట్లే పైన పేర్కొనిన వారి మాహాత్మ్యముకూడ ప్రాకృతలోకమున కతీతమైనది.

యోగానందస్వామిని గైకొన్నచో అతి పవిత్రమైన శ్రీరామకృష్ణుని శిష్యమండలిలోగూడ నాతనికి విశిష్టస్థానమున్నది. తన శిష్యులలో కెల్ల నార్వురిని మాత్రమే ఈశ్వర కోటిగ పరమహంస పేర్కొనువాడు. ఈ వర్గమున శారదానందులు, శివానందులు, రామకృష్ణానందులు మున్నగు

మహామహులకుగూడ ప్రవేశములేదు. అట్టి విశిష్టగణమున యోగానందు లొక్కరనిన వారి ఘనతను వేరుగ వర్ణింప నక్కరలేదు.

యోగానందులు మాతృదేవికి ప్రత్యేకముగ ప్రీతి పాత్రులు. ఆమెవలన నుపదేశము గైకొని పండ్రెండు సంవత్సరము లామె కపారమయిన పరిచర్య చేసినారు. కాశీలో నాతడు చేసిన కఠోర తపస్సున కాగలేక యాతని దేహము పండుటాకువలె రాలిపోయినది. "నన్ను యోగిన్ ప్రేమించి నంతగ మరొక్కరు ప్రేమించుట దుర్లభము. ఎవ్వరయిన తన కొక యర్ధరూపాయ నిచ్చినను, ''ఇది అమ్మ తీర్థయాత్రకు బనికివచ్చును.'' అని నాకయి దాచియుంచువాడు'' అని యాతని మరణానంతర మామె దుఃఖించెడిది.

యోగానందుని తరువాత దీర్ఘకాలమామెను సేవించినవారు శారదానందులే. వీరికి మాతృదేవిపైగల భక్తి వారి నామమునుబట్టియే సువ్యక్తమగుచున్నది. శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము పరమవైరాగ్య పూర్ణులయి సన్న్యసించిన పండ్రెండుగురిలో వీరొక్కరు. అమెరికాలో తాను వేసిన పునాదిపై సౌధము నిర్మించుటకు శారదానందులే తగిన వారని తన యుద్యమమును కొనసాగించుటకు వివేకానందుడు వారినక్కడ కాహ్వానించెను. 1898 లో శ్రీరామకృష్ణసంఘమును నిర్మించి దానికి ప్రథమ కార్యదర్శిగ వివేకానందులు శారదానందుల నియమించెను. వివేకానందుల నిర్యాణానంతరము బ్రహ్మానందస్వామి తరువాత

వారి నధ్యక్షపదవి వరింపబోయినను వివేకానందుని యాజ్ఞ ప్రకారము తానెప్పుడును కార్యదర్శిగనుండుటయే తనకు సంతోషావహమని ఈ శారదానంద స్వామి యాపదవిని నిరాకరించెను.

ఇంతటి త్యాగధనుడు, అద్వితీయకార్యదక్షుడు మాతృదేవి గృహద్వారముకడ నిలచి తానామె "దర్వాన్" (ద్వారపాలకుడ) నని చెప్పుకొనువాడట. మాతృదేవి గృహకృత్యనిర్వహణమనిన తేలికపనిగాదు. ఆమె కలకత్తాలోనున్నను జయరామవటిలోనున్నను 'రాధు' 'మాకు' 'నళిని' మున్నగు మేనకోడండ్రు వారి భర్తలు వారి పిల్లలు ఎందరోయుండువారు. వీరందరికి నన్నవస్త్రములు సంపాదించి యిచ్చినజాలదు. నగలు చేయించవలెను. ఆడపిల్లలకు పెద్దపెద్ద కట్నములిచ్చి వివాహములు చేయవలెను. వివాహానంతరము విశేషవ్యయప్రయాసకరములగు పురుళ్లు పోయవలెను. ఈ పనులన్నియు నాతడెంత జాగరూకతతో నిర్వహించి మాతృదేవి హృదయమును జూరగొన్నాడో ఆమె పలికిన యీ క్రింది వాక్యములవలన దెలియనగును. "నాకీ జీవితమనిన విసుగువచ్చుచున్నది. నేనిక్కడనుండి నిష్క్రమింతును. కాని 'శరత్'ను మాత్రము నాయొడిలో గూర్చుండబెట్టుకొని నాతో దీసికొనిపోదును. నే నెక్కడ నున్నను నాతోబాటు అతడును అక్కడనే యుండవలసినవాడు." ఆమె నిర్యాణానంతర మీ వాక్యములనుగూర్చి విని యాతడు పసిబిడ్డవలె వెక్కివెక్కి యేడ్చెను.

స్త్రీపరిజనమునందు "గోలప్‌మా" యామెకు తోడు నీడయై యత్యంతసన్నిహితురాలుగ నుండెను. ఒక జమీందారునికిచ్చి పెండ్లిచేసిన తన యేకైకపుత్రికను గోలుపోయి యామె శ్రీరామకృష్ణుని శరణుజొచ్చెను. తన నిర్యాణమునకు ముందు "ఈ బ్రాహ్మణిని వదలకుము" అని యాతడు మాతృదేవి కాదేశించెను. ఎండవానలు సోకనీయని గొడుగువలె నామె మాతృదేవిని నిర్యాణపర్యంతము సంరక్షించుచుండెను. ఆమె లేకుండ మాతృదేవి తన మందిరము వీడి యెరుగదు. వివేకానందాది శిష్యులతోగూడ మాతృదేవి యెన్నడును స్వయముగ మాటాడి యెరుగదు. ఆమె మెల్లగ వచించిన వాక్కులను 'గోలప్‌మా' బిగ్గరగ వచించుచుండెను.

ఆమె యాధ్యాత్మికముగ చాల ఉన్నతినందిన వ్యక్తి. మాట కరకుగనున్నను మనసు మెత్తనిది. అనుతోషుమైత్ర యను పరిజనునిచే మాతృదేవి యొకప్పుడు అతిరహస్యముగ నొక కూర తెప్పించుకొని తినుచుండెను. ఇంతలో 'గోలప్‌మా' వచ్చుచున్నట్లు సడికట్టి ఆమెకు దెలియకుండవలెనని యా పరిజనుడు మాతృదేవి యుమిసిన గింజలు, పీచు మున్నగు నుచ్ఛిష్టపదార్థములను మ్రింగివైచెను. "ఏమిచేయుచున్నా"రని 'గోలప్‌మా' యడుగగా ఫలానాకూర తినుచున్నానని మాతృదేవి చెప్పెను. సంగతియంతయు గనిపెట్టి 'గోలప్‌మా' "శూద్రుడు తాకిన కూర తినుచున్నారా?" యని కొంతసేపు జగడ

మాడి, వెంటనే మనస్సు మార్చుకొని "ఉచ్ఛిష్టమెక్కడ నున్నది ?" యని యడిగెను. మాతృదేవి యనుగ్రహము నకు పాత్రుడైనవాడు ఏ వర్ణస్థుడైన నేమియను నభిప్రాయ పరిణతి అంతలోనే గలిగి యామె యా శూద్రుడు తాకిన కూరనుండియే మాతృదేవి యుచ్ఛిష్టమును ప్రసాదముగ స్వీకరింప నెంచెను. ఆమె హృదయమెంత విశాలమైనదో ఈ యొక్క యుదంతమునుబట్టియే తెలియనగును. ఆ యుచ్ఛిష్టము తనకు లభ్యముగాకుండ 'మైత్ర' తినివేసినాడని యామె యెంతో విచారించెను. ఇతరులకు సేవచేయుటలో నామె కేవగింపను మాటయే లేదు. మలమూత్రములు తీయుట మున్నగు నేహ్యమైన యుపచారములు చేయుటకుగూడ జంకెడిది కాదు.

'గోలప్‌మా' వలె 'యోగిన్‌మా' కూడ నిత్యసహచారిణియే. ఆమె విగ్రహము మిక్కిలి యందముగను ఆకర్షణీయముగను నుండెడిది. ఆమెనుగూర్చి పరమహంస యిట్లు పలుకువాడు. "స్త్రీలలో 'యోగిన్‌మా' జ్ఞాని. సహస్రపత్ర కమలమువలె నామె దీర్ఘకాలమునకుగాని వికసింపదు." శారదాదేవితోగలసి బృందావనమున నామె తపస్సుచేసినది. తరచు సమాధిస్థితిలో నుండెడిది. "మూడుదినములు ఎక్కడచూచినను ప్రతి వస్తువునందును నా యిష్టదైవమే ప్రత్యక్షమగుచుండు స్థితిని నేను గాంచితిని" అని యామె యొకప్పుడు పలికినదట!

మాతృదేవిది ఆమెది ఒక్కటే యీడు. మాతృదేవిని కలసికొన్న క్రొత్తలో నొకప్పు డామె దక్షిణేశ్వరము నుండి జయరామవటిపోగా 'యోగిన్‌మా' శూన్యమగు నహబత్‌ఖానానుజూచి మాతృదేవి వియోగమున కోర్వలేక యేడ్చినదట. పరమహంస యామె విచారము నపనయించుచు నూరడించెనట. మాతృదేవిపై నంత యనురాగముండుట యదృష్టముగాదా? యాత్రలలో యోగిన్ మాతృదేవి ననుగమించెడిది. "గోలప్‌కు యోగిన్‌కు నాయట్లు పుట్టానవాళ్లన్నియు దెలియు"నని మాతృదేవి పలుకుచుండెడిది. భగవద్గీత, భాగవతము, చైతన్యచరితామృతము మున్నగు గ్రంథములలో విశేషభాగ యామెకు ముఖస్థముగ నుండెను. కాలమెప్పుడును వృథపుచ్చెడిదిగాదు.

పై యిరువురును 1924 లో మాతృదేవి నిర్యాణానంతరము శాశ్వత సమాధినందిరి.

"గౌరీమా" చరిత్రమును చదివినపుడు స్త్రీలలో నింతటి సాహసికురాండ్రుందురా? యని యాశ్చర్యము గొలుపకమానదు. పసిబాలగనుండగనే రామకృష్ణుల యుపదేశభాగ్యము లభ్యమయ్యెను. బంధువులెంత హింసించినను లెక్కసేయక తనతల్లి సాయమున వారి బారినుండి తప్పించుకొని, బాల్యముననే సన్న్యసించి, సాధువులలోగలసి అనేక గండములుదాటి, హిమవత్పర్వతశ్రేణిని జేరుకొని చిరకాలము తపస్సుచేసెను. ఆంగ్లములోకూడ నారితేరినది. ఏదయిన సంస్థను స్థాపించుటయందును దక్షతతో నిర్వ

హించుటయందును ఎంతటి మగవారుకూడ ఆమెకు చాలరు.

"గౌరీదాసివంటి వ్యక్తి మిక్కిలి యరుదు. ఆమె కామెయేసాటి." అని మాతృదేవి యామెను మెచ్చుకొనియెడిది. ఒకప్పుడు గౌరీమాకు జబ్బుచేయగ మాతృదేవి రాత్రియంతయు మేలుకొని యామె సేవచేసినది. ఆమెకును మాతృదేవిపయి నఖండభక్తి. "రామకృష్ణుని పత్ని రామకృష్ణునికి దీసిపోవునది కాదు. ఆమె మాహాత్మ్యమును గ్రహించుటకు లోకమునకు తాహతున్నదా?" అని యామె ప్రశ్నించెడిది. ఒకానొక దుర్గాపూజాసమయమున మాతృదేవి సన్నిధిని చండీసప్తశతిని పఠించి, "చండీదేవి సన్నిధిని చండీపురాణము పఠనమయినది. నా పఠనము కృతార్థమయినది" అన్నది.

శారదేశ్వరీఆశ్రమమని మాతృదేవిపేరిట స్త్రీలకు నవీనవిద్యయు ప్రాచీన గురుకుల శిక్షణము నొసంగునాశ్రమమొకటి యామె స్థాపించినది. ఇప్పటికి అది సజీవముగనుండి కలకత్తాలోని స్త్రీసంస్థలలో నగ్రస్థాన మాక్రమించుచున్నది. ఆమెయనుచారిణులయిన సర్వసంగపరిత్యాగినులు కొందరు దానిని నడపుచున్నారు. ఆమె సభలో గంభీరముగ నుపన్యసింపగలదు. మద్రాసుపోయి నప్పుడక్కడివారు మాతృదేవి నుపన్యాస మిమ్మనికోరగా, "నాకు చేతగాదు, గౌరీదాసి నా వెంట వచ్చియుండినచో మీ యభీష్టము నెరవేర్చియుండును." అన్నదట. గౌరీమా స్థాపించిన సంస్థలన్నిటిని మాతృదేవి

తన దర్శనముచే గటాక్షించుచు హృదయ పూర్వకముగ నాశీర్వదించుచుండెడిది.

ఇట్టి యపురూప పరిజనులతో నత్యున్నత శిఖరముల నిలచిన మాతృదేవి భూసంచరణమే తప్ప యెఱుగని మానవ మాత్రులకెట్లు ప్రాపణీయయగుచున్నదో ఇంచుక వివరించుట అభ్యుచితము.

ఆమె చారిత్రములోనున్న చిత్రమేయది. అంత సుల భురాలు అంత నిరాడంబరజీవి అంతటి వినయ సంపన్న మరి యొకరుండరు. కలకత్తా బాగ్‌బజారువీధిలో ఉద్బోధ నాశ్ర మములో నుండగ నామెను దర్శించిన యొక యమెరికన్ విదుషీ మణి ఇట్లు వ్రాయుచున్నది :—

"She occupied the upper floor with a few women disciples who were always with. She lived as they did, performing the same homely tasks making no effort to differentiate herself from others save by greater modesty, greeted gentleness and humility." "(ఉద్బో ధనకార్యాలయము) మేడమీద మాతృదేవి తనతో సదా మెలగుచుండు కొందరు శిష్యురాండ్రతో గలసివసించు చున్నది. తక్కినవారి జీవితమెంత నిరాడంబరమైనదో ఆమె జీవితముకూడ నంత నిరాడంబరమైనది. తక్కిన వారికంటె తన యాధిక్యము, బిడియము, నెమ్మది, వినయము మున్నగు గుణములలో చూపించుకొనునుకాని ఇతరత్ర నేమియు భేదము గానరానీయదు. తక్కినవారివలెనే యామె కూడ సామాన్య గృహకృత్యముల నిర్వహించెడిది." ఆమెను

సమీపించినప్పుడెన్నడు నామె మాహాత్మ్యము ముందుకు త్రోసికొనివచ్చి వెరపు గొలిపినది లేదనియు, దేహమునకు జన్మమిచ్చిన తల్లివలెనే యామెకూడ నవ్యాజమయిన యను రాగము వర్షించుచుండెడిదనియు, నిజమునకు ఆమె వర్షించిన దివ్యప్రేమముందు కన్నతల్లులు వర్షించు ననురాగము నిస్సారముగ గనవచ్చెడిదనియు, నామె శిష్యులెల్లరు నేక కంఠముగ నుడువుచున్నారు. దర్శించునపుడామె దేవి యప రావతారమని గుర్తించుట దుష్కరమట. ప్రాకృత వ్యక్తి వలెనే గానవచ్చెడిదట. ఆమె సరళస్వభావము సమ్మోహ నాస్త్రమయి మానవలోకమునకు ఆమెతో చనవు సంపా దించెడిది.

తనయొద్దకు జ్ఞానోపదేశము నిమిత్తము వచ్చినవారి నెల్ల ఏదో యొక వరుసపెట్టి కాని యామె వ్యవహరింప కుండినట్లు గనవచ్చుచున్నది. కొందరిని (అత్తా) (పిపి)యని మరికొందరిని 'కోడలా' (బోమా) యని కొందరిని తల్లీయని మగవారయిన 'నాయనా'యని గాని 'అబ్బాయీ' యని గాని ఏదో యొకవరుస నుపయోగించెడిదట. ఇదికూడ నామెకడ చనవు పెంపొందించుటకు తోడ్పడియుండును.

పెద్దవారియెడ భయముపోగొట్టి చనవును ప్రసాదించు టలో హాస్యరస మొక యమూల్య సాధనము. పురుషోత్తము లెల్లరును హాస్యరసమునిన నాదరణ గానబరచుట కిదియొక కారణమయి యుండవచ్చును. శిష్యులు వ్రాసియుంచిన శ్రీరామకృష్ణ దినచర్య గ్రంథములు గైకొన్నను గాంధీ

మహాత్ముని నిత్యజీవితము తిలకించినను ఈ యంశము స్థాపితమగును. శారదా దేవికూడ హాస్యప్రియ యని ఆమెను దర్శించిన యొక యమెరికను విదుషీమణి వ్రాయు చున్నది :-

A gentle cheerfulness there was about her always, and a lurking sense of humour which made it possible to talk to her of anything. The smallest concern was of interest to her and she could loose herself childish play with as much jest as the little niece of light, Radhu by name, who lived with her. I can still see her amusement over a jack-in-the-box which I brought the little niece from an English shop. Each time it sprang out with familiar Squak, she would repeat the sound, laughing heartily. (Page 227 Days in an Indian Monastery by sister Devamata) "ఆమెకడ నత్యంత లలితమైన ప్రసన్న చిత్తతయొకటి సదా ప్రత్యక్షమగుచుండెడిది. అవ కాశమెప్పుడు వచ్చునాయని పొంచియుండు నామె హాస్య రసముకూడ నేవిషయమును గూర్చియైన నామెతో ముచ్చ టించుటకు చనవునొసగెడిది. ఆమె ఎంత స్వల్పాంశము నందైన శ్రద్ధాళువై యాసక్తి చూపెడిది. ఆమెతో వసించు నెనిమిదేండ్ల వయస్సుగలిగిన రాధువలెనే యామెకూడ పసి పిల్లల క్రీడలలో మైమరచి వినోదింప గల్గెడిది. ఒక యింగ్లీషు షాపునుండి రాధూకు నే నొక యాటవస్తువు కొని తెచ్చియిచ్చితిని. (ఒక రకమగు వింతధ్వని చేయుటయే దాని విశేషము) ఆ వస్తువుతో మాతృదేవికూడ ఆడు

కొనుచు అది వింతగ ధ్వనిచేసినపుడు ఆ ధ్వనిని తానును అనుకరించి కడుపుబ్బ నవ్వుచుండెడిది.''

ఆమెతో నిత్యము సన్నిహితముగ వర్తించిన గణేంద్రనాథ బ్రహ్మచారికూడ ఆమెకడ హాస్యరసము మిక్కుటముగ నుండెనని వ్రాయుచున్నాడు. ఆమె తమ్ముడొకడు కాళికా దేవిపై కీర్తన నొకదానిని వ్రాసిపట్టుకొని వచ్చి చివర పెద్ద పెద్దకవులు కీర్తనలలో తమ నామము నుదాహరించుకొను నట్లుగ నాతడును తన నామము నంకితముచేసెను. ''అబ్బో! నీవుకూడ 'నామాంకితము చేసికొన్నావు. గిరీశచంద్రఘోషు అంతటి మహాకవి వన్నమాట.'' అని యామె హాస్యముచేసిన దట. ఒక శిష్యురాలు బేలూరు మఠమును చూచివచ్చిన వెనుక నామెను దర్శింపగ ''నాశ్రమములో నేమి చూచి తివి?'' అని దేవి ప్రశ్నించినపుడు ఎక్కడ మొరలుపెట్టుట కును తోచక పాప మా యమాయకురాలు ''ఆశ్రమములో నావులున్నవి'' యనెనట. ''ఆశ్రమమంతటికిని నీకు గన వచ్చినవి పశువులా?'' అని మాతృదేవి హేళనముచేసినదట.

ఆమె హాస్యరసమునకు నుదాహరణములు విస్తారముగ జిక్కుటలేదు. వ్రాసియుంచకపోవుటలో శిష్యుల ప్రాలు మాలికయే గోచరించుచున్నది. గాని మిక్కిలి నాజూకయిన హాస్యమును బ్రయోగించుటలో నామె దక్షురాలని విశ్వ సించుట కెంతైన నవకాశమున్నది.

ఒక్కొకచో ప్రత్యక్షమగు నామె యమాయకత్వము గూడ మనకామెను సన్నిహితురాలిగ జేయుచున్నది.

కలకత్తా వచ్చిన క్రొత్తలో సీటికుళాయి త్రిప్పగ నీరు రాక ముందు అది బుస్సుమని ధ్వని చేసినదట. ఆమె పరుగున బోయి యింటిలోనున్న తక్కినవారితో నా కుళాయిలో త్రాచుపామున్నదని వచించెనట!

## 22. దక్షిణదేశ యాత్ర

సమప్రదేశమున బ్రవహించు నదీమతల్లివలె మాతృదేవి జీవితము ఒడుదొడుకులులేక హాయిగ నడచిపోయెను. ఎంతసేపును ధ్యానసమాధియందును, ఉపదేశ ప్రదానమునందును కాలము గడపిన యామె చారిత్రమున బాహ్యోదంతముల కవకాశము తక్కువ. ఉన్నంతవరకు బాహ్యోదంతము లాయాసంర్భముల ననుసరించి ఇదివరలో చాలా వరకు చిత్రితములైనవి.

1898 వ సంవత్సరము నవంబరు నెల 13 వ తేదీని ఆమె నూతనముగ నిర్మితమయిన బేలూరు మఠమున ప్రప్రథమమున పాదము మోపినది. 1909 వ సంవత్సరము మెయి 23 వ తారీఖు ఆమె జీవితమున ముఖ్యదినములలో నొకటిగ నెన్నదగినది. ఆమె నిమిత్తము కలకత్తాలో శారదానందులు నిర్మించిన ఉద్బోధనాశ్రమమున మొట్టమొదట నామె యడుగుపెట్టిన దాదినముననే.

మద్రాసులో నిర్మితమయిన రామకృష్ణమఠమునకు రామకృష్ణానందస్వామి యధ్యక్షులు. వీరు శారదానందుల వలెనే శ్రీ రామకృష్ణుల ప్రత్యక్షశిష్యులు. శారదామణీ

దేవి సాక్షాత్తు పరమేశ్వరియనియే వీరి విశ్వాసము. ఆమె చరణరజముచే దక్షిణాపథమును పావనము చేయించవలె నని వీరి దృఢసంకల్పము. వారిప్రార్థనల నాలకించి యామె 1909 డిసెంబరులో దక్షిణమునకు బయలుదేరి నడుమ నడుమ కొన్ని ప్రదేశములలో నాగి 1910 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో మద్రాసు చేరుకొనెను.

మద్రాసులో నొక్కమాసముండి ద్రావిడదేశస్థుల భక్తికి నియమబద్ధ జీవితమునకు మిగుల హర్షించెను. పెక్కండ్ర కుపదేశప్రదాన మొనర్చెను. రామేశ్వర యాత్రకూడ చేసెను. నూట యెనిమిది బంగారు బిల్వదళములను చేయించి తెచ్చి రామకృష్ణానందు లామెకు సమర్పింపగ వానితో నామె సేతురామేశ్వరుని బూజించెను. తిరిగి మద్రాసువచ్చి యక్కడనుండి బెంగుళూరు పావనముచేసెను. రైలుబండి దిగిదిగకుండగనే బెంగుళూరు పౌరులు ఈమెను పువ్వులవానలో ముంచెత్తిరి. బెంగుళూరులో రామకృష్ణాశ్రమమదివరకే నిర్మితమగుటచే నందే యామె బసచేసెను. ఈ యాశ్రమమునకు వెనుకనున్న కొండపయి జపముచేసి కొనుచు నొకనాడున్నత స్థితిలోనుండగ రామకృష్ణానందు లామె పాదములకు మ్రొక్కి "ఓ గిరిరాణీ! ఓ దయామయీ' కన్నబిడ్డల మయిన మాపయి నీవు ప్రసన్నదృష్టిని బరపుము." అని భావపూరితులయి ప్రార్థించిరి.

మరల కలకత్తాపోవుచు రాజమహేంద్రవరమున నొక్కరోజుండి పవిత్రమయిన గోదావరిని తన స్నానముచే

పునఃపవిత్రీకృత మొనర్చి జగన్నాథములో రెండు రోజు లుండి తిరిగి 11 వ ఏప్రిల్ 1911 నాటికి కలకత్తా చేరు కొనెను. ఆంధ్రరాష్ట్రముపేరు చెప్పి యామె యడుగు మోపిన దొక్కరాజమహేంద్రవరమున నే. బరంపురమున కూడ నొక్కరోజు వసించినదిగాని ప్రకృతము బరంపుర మాంధ్రరాష్ట్రములో లేదుకదా!

1912 నవంబరులో మూడవసారి యామె కాశీ యాత్రచేసినపుడు రెండు నెలల యొకపక్షమామె కాశీలో వసించి యాక్షేత్రమును సావధానముగ సేవించుకొనెను.

ఈ సందర్భమున నామె కాశీలో నిరువురు మహా పురుషులను దర్శించెను. అందొకరు 'నానక్' మతమునకు చెందిన సన్న్యాసి. రెండవవారు శ్రీరామకృష్ణుల గురువగు తోతాపురికి సమకాలికులు. 'చెమిలీపురి' యని వారి నామ ధేయము. మీ కన్నపానాదుల సదుపాయ మెవరు చేయు చున్నారని "గోలప్‌మా" వారిని ప్రశ్నింపగ, "ఇంకెవరు చేయుదురు? అన్నపూర్ణాదేవియే చేయుచున్నది." అని వారు ప్రత్యుత్తరమిచ్చిరట. ఆ జవాబుకు మాతృదేవి మిక్కిలి సంతోషించెను. "ఆ వృద్ధసన్న్యాసి ముఖము పసి బిడ్డ ముఖమువలె నత్యంత సరళముగనుండి సదా నాకు గన్నుల గట్టినట్లున్నది. అని యింటికి వచ్చిన తరువాత మరునాడు వారికి కొన్ని నారింజపండ్లను కొంత మిఠాయియు నొక కంబళీయు కానుకలుగ సమర్పించెను. "ఇంక మహా పురుషులను దర్శింపరా"యని యొకరు ప్రశ్నింపగ, "చెమిలీ

పురిని జూచితిమి చాలదా ? అంతకంటె మహాత్ములెవ రుందురు ?" అని యామె సమాధానము చెప్పెడిది.

## 23. స్వరూపద్వయము

"ఆమె బగళ. పైకి ప్రశాంతస్వరూపిణిగా గనవచ్చినను నాంతర్యమున ప్రచండశక్తి నిలయ." అని వివేకానందులు శారదా దేవినిగూర్చి పలికినారుగదా. ఇంతవరకు నామె ప్రశాంత స్వరూపమే చిత్రితమైనది. ఆమె ప్రచండ స్వరూపముకూడ కొంత స్ఫురితము కావలసియున్నది.

ప్రబోధచంద్ర చటర్జీ యిట్లు నుడువుచున్నారు: "శివదాదా (రామకృష్ణుని యన్నకుమారుడు) లేని సమయముచూచి ఆతని భార్య యాతని కుమార్తె నొక హీన కులజునకిచ్చి వివాహము చేయవలెనని యెంచి యా కుమార్తెను గదిలో తాళము వైచియుంచెను. నేనును జ్ఞానమహారాజును గలసి తాళము బ్రద్దలుకొట్టి యా పిల్లను బలాత్కారముగా జయరామవటి తీసికొని వచ్చితిమి, మేము చేసిన పని శివదాదా యనుమతిమీదనే జరిగినదాయని మాతృదేవి ప్రశ్నించి, అనుమతిమీదనే జరిగినదని మేము సమాధానము చెప్పిన పిమ్మట నామె హర్షించి యూరకుండెను. ప్రసంగ వశమున దాదాభార్యకు క్రోధము హెచ్చి యామె వసించు కుటీరమునే యామె తగులబెట్టవచ్చునని మేమనుకొంటిమి. ఆ కుటీరము శ్రీరామకృష్ణుల పిత్రార్జితము. ఈ మాటలు వినుచున్న మాతృదేవి యకస్మాత్తుగా మాతో "తగుల

బెట్టినచో మరింత యందముగానుండును. 'ఠాకూరు' శ్మశాన ప్రియులు. ఆ ప్రదేశము శ్మశాన ప్రాయమయి వారికి మరింత ప్రేమపాత్రమగును. ఆ ప్రదేశమంతయు మహాశ్మశానమై పోవును" అని చెప్పుచు నామె కలకల నవ్వనారంభించెను. క్షణక్షణమునకు నామె కంఠమునకు స్థాయి హెచ్చిపోవు చుండెను. అది మాకు భయోత్పాదకమయ్యెను. ఆ భయంకరమైన హాసము నామె మానలేదు. ఇరువది-ఇరువది యైదు సెకనులవరకు నామె యీ తీరున నట్టహాసము చేయుచుండుటచూచి మేము భయకంపితులమైతిమి. ఇంతలో మాతృదేవి యా ప్రచండ స్వరూపము నుపసంహరించుకొని సాధారణస్థితికివచ్చి మధురమైన వాక్కులతో మా భయము నెల్లను పారద్రోలెను."

ఆమె భయంకర స్వరూపమునకు "నళినబాబు" మరియొక యుదాహరణ మిచ్చుచున్నాడు. "ప్రపంచ సంగ్రామము జరుగుచున్నపు డామెకు నేనుపోయి యుద్ధవార్తలు వినిపించువాడను. ఒక నాడట్లు వినిపించుచుండగ మొదటి పదినిమిషములు మందహాసము చేయుచు సౌమ్యస్వరూపముతో విన్నది. ఇంతలో నకస్మాత్తుగ ననుకొనని మార్పు వచ్చి యామె బిగ్గరగ నవ్వనారంభించినది. ఆ భయంకర హాసమునకు మందిరమంతయు గజగజలాడిపోవుచుండెను. సరిగా జ్ఞప్తిచాలదుగాని అప్పుడు సమీపమున నున్న 'గోలప్‌మా' యో 'యోగిన్‌మా' యో ఆమె కడకువచ్చి చేతులు జోడించుకొని శాంతింపవలసినదిగ నామెను ప్రార్థిం

చిరి. మాతృదేవి యామె ప్రార్థనము నాలకించి తన యుగ్ర స్వరూపము నుపసంహరించుకొనెను.

పై రెండుదంతములును గణేంద్రనాథ్ బ్రహ్మచారి గారి గ్రంథమునుండియే గైకొనబడినవి. ఈ క్రింది యుదంతము మద్రాసు రామకృష్ణ మఠమువారు ప్రచురించిన మాతృదేవి జీవితమునకూడ నున్నది గాని గణేంద్రనాథుల ననుసరించియే దాని నిందు పొందు పరచుచున్నాను: హరీశ చంద్రుడను గృహస్థు డొకడు ఆమె శిష్యుడు. శ్రీరామకృష్ణుల నిర్యాణానంతర మాతడు కొంతకాలము కమార్పుకురమున నామె కడ వసించుచుండెను. అప్పటికే యాతనిమతి కొంత చలించినది. ఆతని యవస్థకెంతో జాలిపడి మాతృదేవి యాతని నెంతో దయతో జూచుచుండెను. ఉద్రిక్తతచే నొక్కొక్కప్పుడాత డుచితానుచితములు చూడక మాతృదేవితో, "నీవు ప్రకృతివి నేను పురుషుడను" అని పలుకుచు నామెకు ప్రసాదముగ నుద్దేశించి కొంత యుచ్ఛిష్టమును విస్తరిలో వదలుచుండువాడు. ఆతని తుంటరితనమునకు నొచ్చుకొని మాతృదేవి యా సంగతినిగూర్చి శారదానందుల తోడను నిరంజనానందుల తోడనుగూడ జెప్పెడిది. ఒకనాడామె ప్రక్కయింటినుండి తన కుటీరమున బ్రవేశింపబోవుచుండగా నామెను బలాత్కరింపనెంచి యాతడు వెంటనంటెను. ఇది కనిపెట్టి మాతృదేవి గాదె వెనుక దాగుకొనబోయెను. కాని యా దుండగీడు ఆమెను వదలలేదు. ఏడుసారు లామె గాదెచుట్టును బ్రదక్షిణము చేయుచు పరుగెత్తినది గాని

లాభమున్నట్లు కనబడలేదు. తోడనే యామె తిరుగబడి యుగ్రస్వరూపిణియై యతనిని క్రిందబడవైచి రొమ్ము నధిరోహించి ఇటునటు చెంపలు వాచిపోవునట్లుగా గొట్టెను. ఆతడు "బాబోయి నన్నువదల"మని బ్రతిమాలు కొనగా దయదలచి వదలిపెట్టెను. ఇంతలో నిరంజనానందు లాగ్రామమువచ్చినారని విని యాతడు బృందావనము పారిపోయెను. మాతృదేవి యిచ్చిన ప్రహారణము లాతనికి మనశ్శుద్ధిని ప్రసాదించెననియు తరువాత నాతడు సద్భక్తుడుగ మారిపోయెననియు జెప్పుదురు. ఆతని చరమదశలో గజేంద్రనాథు డాతనిని దర్శించెనట. అప్పటి కాతడు ప్రశాంతచిత్తతనే ప్రదర్శించెననియు శ్రీరామకృష్ణులగూర్చి మాటాడిరనియు వారు వ్రాయుచున్నారు.

అభేదానందులు మాతృదేవినిగూర్చి వ్రాసిన స్తవములో

ప్రసీద మాతర్వినయేనయాచే

నిత్యంభవ స్నేహవతీసుతేషు

అను భాగము జదివినపుడు "అమ్మా! నీవు నీ కుమారులయందు స్నేహవతివికమ్ము" అని ప్రార్థించు టావశ్యకమా? తన సుతులయందు స్నేహముంచుమని తల్లిని ప్రార్థింపవలసిన యగత్యముండునా? యనిపించినది. కాని ఆమె యీ ప్రచండ స్వరూపమునుగూర్చి కూడ చదివిన పిమ్మట నట్టి ప్రార్థనముకూడ సమంజసమే యనిపించుచున్నది.

## 24. నిత్యకల్యాణి

ఏ యఖండ సచ్చిదానంద తేజమునుండి శారదా రామకృష్ణు లావిర్భవించిరో అందే వారి నిత్యకల్యాణ మండపము నిర్మితమైనది. రామకృష్ణుని పిలుపు శారదకు విన వచ్చినది.

1919 డిసెంబరులో మలేరియా జ్వరమువచ్చినది. వ్యాధి ముదిరి రక్తహీనతచే కాళ్లు మెరుగుజూపినవి. 'రాధూ'ను దూరముగా బొమ్మని యామె నిష్కర్షగా యాజ్ఞాపించినది. దీనినిబట్టి యామె నిష్క్రమణము నిశ్చిత మని శారదానందులు నిర్ణయించుకొనిరి. ఒకనా డాతడు తనకు స్వయముగ దినిపించిననేగాని యాహారము ముట్టనని పట్టుపట్టినది. అదివర కాతడు వచ్చినపుడెల్ల ముఖమునకు ముసుగువైచుకొని యింకొకరి ద్వారా సంభాషించెడిది. ఇప్పుడట్లుగాక దగ్గరకురమ్మన్నది. గడ్డము ముద్దిడుకొన్నది. చేతులతో నొడలునిమిరి, "పాపము బిడ్డ! నాకోసము ఎంత కష్టపడుచున్నావో!" యని పరితపించినది. మరియొక నా డాతని సమీపమునకు బిలచి, "నేను పోవుచున్నాను. 'గోలప్' 'యోగిన్' మొదలైన నా పరిజనులున్నారు. జాగ్రత్తగ కనిపెట్టుము." అని యొప్పగించినది. ఆమె మాటాడిన కడపటి పూర్ణవాక్యమదియే. మరియొకసారి మాటాడజూచినదిగాని మాటరాలేదు.

మాటపడిపోవుటకు పూర్వము ఒక శిష్యురాలామెను సమీపించి, "అమ్మా! ఇంక మాకేమిగతి?" అని యేడ్చి

నది. "ఠాకూర్‌ను ప్రత్యక్షముగ జూచితివిగదా! నీకేమి కొదువ?" అని యామె కభయహస్త మిచ్చినది.

గంగానది యనిన నామెకు ప్రత్యేక భక్తిగదా! "నన్ను గంగకు దీసికొనిపోండు." అని తరచు కోరుచు వచ్చెడిది.

1920 సం॥ జూలయి 20 వ తేదీ రాత్రి 1–30 గంట లయినది. నిర్యాణమునకు ముందు ముఖము నల్లబడినదట. కాని నిర్యాణానంతరము బిగుసుకొనిన దేహము కొంత వదులుబారి ముఖమున కొక యద్భుతమైన కాంతివచ్చెనట. పూజాసమయమున దుర్గాదేవి ముఖమెట్లుండునో అంతటి యపురూప సౌందర్యముతో దివ్య తేజముతో నామె ముఖము వికసించినదట. ప్రశాంతతయు పరమానందమును చేయి చేయి గలుపుకొని యా ముఖమున లాస్యమొనరించినవట!

శారదా రామకృష్ణు లొక్కటైనప్పుడు ప్రశాంత తయు పరమానందమును సమ్మేళన మొందవా?

అదిగో! ఆ వధూవరులు నిత్యకల్యాణమండపమున ముసిముసి నవ్వులు నవ్వుచున్నారు. మనము పెండ్లి పెద్దల మయి వారిపై నాశీర్వాదాక్షతలు జల్లుదము.

"అయంముహూర్త స్సుముహూర్తోఽస్తు. మీ సంతతి తామర తంపరై కలకాలము వర్ధిల్లుడు."

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



# ఈ రచనకు తోడ్పడిన పుస్తకములు పత్రికలు

1. "శ్రీ శారదాదేవి" మైలాపూరు శ్రీ రామకృష్ణ మఠమువారు ప్రచురించిన ఆంగ్లగ్రంథము.

2. "శ్రీ శారదాదేవి" అద్వైతాశ్రమమువారు ప్రకటించిన చిన్న ఇంగ్లీషు గ్రంథము.

3. గణేంద్రనాథ బ్రహచారిగారు బంగాళీలో వ్రాసిన శ్రీ శారదాదేవి అను గ్రంథమునకు అచ్చుకాని యాంగ్లానువాదము.

4. ప్రబుద్ధభారత పత్రిక వెనుకటిసంచికలు.

5. 1954 మార్చినెల మాతృదేవి శతవార్షికోత్సవ సంచిక (ప్రబుద్ధ భారతి).

6. 1920 జూలయి నెలలో ప్రకటితమయిన మాతృదేవినిగూర్చిన మహేంద్రనాథగుప్తుల వ్యాసము.

7. దేవమాత రచించిన "హైందవ మతములో కతిపయ దినములు" అను నాంగ్లగ్రంథము.

8. దేవమాత రచించిన "శ్రీ రామకృష్ణుడు అతని శిష్యులు" అను నాంగ్లగ్రంథము.

9. శారదానందుల లీలాప్రసంగమునకు జగదానందు లొనర్చిన ఆంగ్లానువాదము.

## శ్రీ శారదా ప్రసంగములు

శ్రీ రామకృష్ణ పరమహంస సహధర్మచారిణియు, ఆదర్శ సతి, ఆదర్శయోగిని, ఆదర్శమాతయునగు శ్రీ శారదాదేవి భక్తులతో నొనర్చిన దివ్య సంభాషణలు.

"...ఈ గ్రంథము ఆంధ్రదేశమున అక్షరాస్యులగు స్త్రీ లెల్లరు జదువదగినది..."

—త్రిలిఙ్గ

312 పుటలు వెల: రూ. 2-8-0

## శ్రీ శారదా సూక్తినవనీతము

శ్రీ రామకృష్ణ పరమహంస సహధర్మచారిణియగు శ్రీ శారదామణి దేవిగారి దివ్యోపదేశ వాక్యములనుండి యేర్చికూర్చిన అమూల్యసూక్తులు.

118 పుటలు (త్రివర్ణ ముఖచిత్రముతో) వెల: అణాలు 6

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| | రూ. అ. |
|---|---|
| శ్రీమద్భగవద్గీత | 4- 0 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 3- 0 |
| శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర | 1- 4 |
| జ్ఞానయోగము | 3- 4 |
| నారద భక్తిసూత్రములు | 3- 0 |
| ప్రబోధ రత్నాకరము | 2- 4 |
| రాజయోగము | 2- 4 |
| కర్మయోగము | 1- 8 |
| భక్తియోగము | 1- 4 |
| వివేకానంద లేఖావళి | |
| మొదటి భాగము | 1- 8 |
| రెండవ భాగము | 1- 8 |
| అనుష్ఠాన వేదాంతము | 1- 4 |
| వివేక సూర్యోదయము | 1- 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0-12 |
| గిరీశచంద్ర | 0-12 |
| భక్తిమార్గము | 0- 8 |

| | రూ. అ. |
|---|---|
| శ్రీ దొడ్డ భాగవతము | |
| (ప్రథమ సంపుటము) | 6- 8 |
| (ద్వితీయ సంపుటము) | 5- 8 |
| (తృతీయ సంపుటము) | అచ్చు |
| చికాగో నగరోపన్యాసములు | 0- 8 |
| గురూపదేశములు | 0- 8 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0- 6 |
| శ్రీవివేకానంద శంఖారావము | 0- 6 |
| నా సంస్కరణ యుద్ధ విధానము | 0- 6 |
| నా గురుదేవుడు | 0- 6 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | 0- 4 |
| నవీన భారతదేశము | 0- 4 |
| ముక్తిమార్గము | 0- 3 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0- 3 |
| శ్రీ రామకృష్ణ ఆరాత్రికము | 0- 2 |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0- 1 |
| యతిగీతము (పద్య కా.) | 0- 1 |

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 4.